

# కావ్యగణపతి అష్టోత్తరం



సంకలనం - తాత్పర్యం

**కపిలవాయి లింగమూర్తి**



# కావ్యగణపతి అష్టోత్తరం



సంకలనం - తాత్పర్యం

**కపిలవాయి లింగమూర్తి**

కావ్యగణపతి అష్టోత్తరం
ప్రథమ ముద్రణ
ఈశ్వరమాఘం - 6-2-1998
ప్రతులు - 1000



వెల - 40/-

*ముఖపత్ర రచన .*
శీలావీర్రాజుగారు

*అక్షర విన్యాసం*
గౌరీ గ్రాఫిక్స్, రాంనగర్,
హైద్రాబాద్. ఫోన్ : 7640468

*ముద్రణ*
శ్రీదుర్గా ఆఫ్‌సెట్ ప్రాసెసింగ్ & ప్రింటింగ్,
గాంధీనగర్, న్యూ బాకారం,
హైద్రాబాద్. ఫోన్ : 7615174

*ప్రతులు లభించు చోటు*
**డా॥ బాల్నారాయణగారు,**
అచ్చంపేట,

**కపిలవాయి లింగమూర్తి,**
వాణీ సదనం, 17-110,
నాగర్‌కర్నూలు-509 209.

# అవతారిక

నేనీ కృతిని క్రీ.శ.1990లో కూర్చినాను. ఆయేడునన్ను వినాయక చతుర్థికి పాలెంలోని వ్యవసాయకళాశాల వారు మాట్లాడవలసిందని కోరినారు. అపుడునేను వినాయకుని గురించి ప్రాచీన కవులేయేవిధంగానుతించినారో ఉటంకిస్తు వివరిస్తు పోగా అది విన్న అప్పటి అగ్రికల్చర్‌డైరెక్టర్ శ్రీడి. నారాయణగారు ఉపన్యాసం బాగుందని అభినందించినాడు.

అప్పటి ఆయనభినందనయే యిల్లు చేరిన తర్వాత నన్నీసంకలనానికి పురికొల్పింది. దీన్ని ఒక అష్టోత్తరశతంగా సంధానించవలెననుకొని తీరిక కలిగినపుడల్లా నాగ్రంథాలయం నుండీ పద్యాలుసేకరిస్తు దానికి వివరం వ్రాస్తు పోయినాను ఇట్లాయిది ఒక ఆరునెలల్లో ముగిసింది. నేనీ సంకలనంలో అన్ని వృత్తాలే ఉండవలె గాని జాత్యు పజాతులు చేర్చరాదనుకున్నాను. ఇందుకు నాకు సొంతభాండాగారంనుండి 95 పద్యాలులభించినవి. తక్కినవానికి కర్నూలుని వాసి వైద్యం వేంకటేశ్వరాచార్యులనడిగినాను.

తే॥ అతడు రెడిరెఫరెన్సగునన్నిటికిని-వైద్యమనియింటిపేర్తాళ పత్రములకు
వైద్యముంజేయు కలముతో వడుపులెరిగి-వృత్తివేరగుగా కప్రవృత్తియదిగ

అతడు ఓపదేనుపద్యాలు నాకులభించనివి పంపినాడు. ఆతరువాత మళ్లినాకు గూడా సరిపోను ఇతరత్ర లభించినవి. వాటికి గూడ దీనిలో అవసరమైన చోట స్థానం కల్పించినాను.

ఆవిధంగా యిది తుదిరూపం పొందిన పిమ్మట యిక ప్రధానమైన ఆలోచనప్రారంభమయింది. ఈ నాటి అస్మదాదుల వ్యవహారం తెలుగు కావ్యనాయికవలె ఉంటుంది. ఆమె ఉబుసుపోకకై వపవిహారానికి పోయి అక్కడెవరో మగ పురుగు కంటబడగా అతని చూపుల్లో చిక్కి విలవిలలాడిపోతు అయ్యో! నేనాతోటకెందుకువెళ్లితిని. వెళ్లితిని పోక అక్కడికే ఆ రాకుమారుడెందుకు రావలె. వచ్చెను పోనాకంటనేయెందుకు పడవలె. నేను చూచితిని పోనామనసెందుకతనిపై తగులవలె అని ఆతర్వాత తీరికగా పశ్చాత్తాపానికిలోనవుతుంది. అట్లాగేనావంటివారు బుసుపోకకేదో ఒకటి వ్రాస్తూ ఆపిమ్మట వానిముద్రణకై తాపత్రయంచెంది దాతల చుట్టు ప్రదక్షణలు చేస్తుంటారు. ఇదొక విషవలయం. ఈ వలయం నుండి బయటపడేకవి కుమారుడు ధన్యాత్ముడు.

చెళ్లపిళ్ల వెంకట శాస్త్రినిగారొకపుడేదో జబ్బుపడిహాస్పిటల్లో మంచంపైఉన్నాడట అపుడు డాక్టరుగారు మీరేది ఆలోచించకుండా రెస్టు తీసుకోండి అనిచెప్పి వెళ్లి కొంత సేపటికి మళ్లీరాగా ఆయనపడుకొనే ఏదో వ్రాసికుంటున్నాడట. అపుడుడాక్టరు గారునేను మిమ్ముల్ని రెస్టు తీసికొమ్మన్నానుగాని వ్రాసికొమ్మన్నానా అని మందలించగా అయ్యా! శరీరంలో చేరిన ఫారిన్ మేటరు తొలగిపోవాలని మీరే అంటారుగదా! మరి బుర్రలో దూరిన ఈ పారిన్‌మేటరు తొలగిపోకుంటె ఎట్లా! అన్నాడట, అదివిని డాక్టరుగారాయన సమయస్ఫూర్తికి నవ్వుకున్నాడట్ల కాని కవులందరు చెళ్లపిళ్లలు గాక పోయినా అతని సహజాతం ఆయన సెలవిచ్చిన దానిలో గర్భితమై ఉంది. కవి యైన వాడూరకోలేడు. ఏదో ఒకటి గిలుకుతూనే ఉంటాడు.

నేనిదివరకెప్పుడైనా ఒకరిద్దరు వ్రాతలవాళ్ళున్నారని కదిలించి చూచినాను. ఇప్పటికది చాలనిపించింది. వ్యక్తి వ్రాతలయిన గాని అతనిలో పెట్టుబడిపెట్టటం ఒకకళ. అది నాకలవడలేదు. వాగ్దేవి వాళ్ళాయనతో చెప్పి మరెవ్వరికీ యిటువంటి స్థితికలుగకుండా చేయుగాక!

నేనప్పటివలెనే దీన్నిగూడ స్వంతంగా ఒక మూలనపడవేసినాను. కాని పాత్రలోవండిన అన్నానికి చెట్టుకు పండిన పండుకు ఈడు వచ్చిన కన్యకు ఏదో ఒక భోక్తలభించకపోదని పెద్దలమాట. ఒకొక్కపుడు కవుల రచనలుగూడ ఈ పనులలోనే చేరుతుంటవి.

ఊహాపోట మరించినపుడేదో వ్రాయటమేకాని వాటిని ముద్రించుకునే వ్రాత నాకు వ్రాసిలేదు. అందుచేత నా పరిష్కృతాలకుగాని స్వీయ రచనలకుగాని వెలుగు చూపటానికభిమానులే ఎక్కువగా ప్రయత్నిస్తుంటారు. అటువంటి సుకృతం నాజాతకంలోనే ఎక్కడనో ఉంది అనిపిస్తుంది.

# "అంకితం"

నా రచనలకొరకు ప్రయత్నించేవారిలో రాకొండనివాసి మల్లేపల్లి శేఖర్ ప్రథముడు - అతనిని గురించి నా చక్రతీర్థమహాత్మ్యంలో

తే॥ వ్రాయుటేగాని తక్కిన భారమెల్ల - శేఖరుడెపూని తత్ప్రతి జేయగాని
గురువులకు నెల్ల నిటువంటి గూర్పువారి - గూర్పుగాకవి గోవింద గోరుకొందు.

ఇంతవరకే చెప్పినాను. ఇకరెండవవాడు ఎమ్.డి. భాంగర్. ఇతడెపుడు యింకా మిగిలిపోయిన రచనల గురించి అంచనా వేస్తుంటాడు. మూడవవాడు వై. దేవదాసం అప్పుయి మిగిలిపోయిన వానిని గురించి ఆలోచిస్తుంటాడు. వీరంతా ఒకనాడు నా శిష్యులు. నేడుపాధ్యాయులు.

నాజన్మ గ్రామం జనుకుంట. అచ్చంపేట తాలూకాలోని గ్రామం. ఇపుడు బలుమూరు మండలంలో ఉంది. అచ్చంపేట తాలూకాలో డాక్టర్ బాలనారాయణ గారిని ఎరుగనివారు ఎపుడో ఒక సందర్భంలో అతనితో వైద్యం చేయించుకొనివారరుదు. వైద్య కళతోపాటు అతనితో సాహితీ ప్రియత్వయం ఉండటం ఒక పూర్వ పుణ్యఫలం. అతడింతవరకే నాతో తమ గ్రామమైన ఉప్పునుతల కథ వ్రాయించినాడు. నేను భాగవత కథాతత్త్వం వ్రాసిన దినాలలో నన్ను పిలిపించుకుని దానికి ఆర్థిక సహాయం చేసినాడు. దానిలో వీరి వంశం సమగ్రంగా చెప్పినాను. పాలమూరు జిల్లా దేవాలయాలకుగూడ అతని సహాయం అందింది. కాబట్టి ఈతప పలుకరించదలచుకోలేదు. ఒక పర్యాయం ప్రస్తావనలో మాత్రం ఇపుడేం చేస్తున్నారన్న దానికి బదులుగా ఇది కూర్చుతున్నానని చెప్పినాను. అదివిని అప్పటికి చేయి యిబ్బందిగా గ్రామస్థులతో ప్రయత్నించి చూదాం ఒక మంచి కృషి గదా! అన్నాడు.

వస్తు ప్రాశస్త్యాన్ని గ్రహించిన వాడు దాన్ని ఏలాగైనా సొంతం చేసికోలేక ఉండలేడు కాబట్టి ఆ గణపతి యితనికి మళ్ళీ ఏం బుద్ధి పుట్టించినాడో! ఈ అవకాశం ఇతరులకెందుకు పోనిస్తావని ఎక్కడనో అంతర్మాలో చెప్పి ఉంటాడు. అందుచేత మళ్ళీ తానే శేఖర్‌తో ఆ పుస్తకానికి ఎవరూ అవసరం లేదు నేనే వేయిస్తానని సార్‌గారికి చెప్పు అని కబురు పంపినాడు. అందువల్ల అతనినిపుడు

శా॥ శ్రీల్నిండారనొసంగి సంతసములం జేకూర్చుచున్ సర్వదా
మేల్నొం దించుచు స్వీయవృత్తి చదురుంచెంపొందనే వేళవే
డ్కల్నెక్కొ అనగా ప్రసన్నముఖుడౌ గంధేభవక్త్రుండు మా
బాల్నారాయణ వైద్య రత్నమును సంభావించు నెల్లప్పుడున్

మ॥ తనసంపాదన దైవకార్యములకై దానలు ధర్మాలకై
తనయాలోచన నిత్యసత్యములకై నిర్మాణకార్యలకై
తన లక్ష్యంబు సమస్తమానవ సమానత్వంచుకై శాంతికై
గననీ చంద్ర కళావిభుండు గుణసంకాశుండు నై గన్పడున్

శా॥ పౌలస్త్యాన్వయమందు సూర్యకులమన్ ప్రఖ్యాత గోత్రంబునన్
నాళీకాక్షుని పేరునన్ వెలసి యుంద ద్వైభవశ్రీలయం
దోలిన్ద్వాధశమైన యంశముననుద్యోగంబు చేపట్టియే
వేళన్నచ్చమపేట యందు బొలుచుంబ్రీతిన్ జనామోదియై

అనియెంచి "**అష్టవర్షాభవేత్కన్యా పుత్రవత్పాలియామయా - ఇదానీం తవహస్తేషుదత్తా**'

'- అని యీ సంకలనకృతి కన్యనతని చేతులలో పెడుతున్నాను.

ఇట్లు

సాహిత్యారాధకుడు

**కపిలవాయిలింగమూర్తి**

ఇం.నెం. 17-110

వాణీసదనం,

విద్యానగర్‌కాలనీ,

నాగర్‌కర్నూలు - 509 209.

ఈశ్వర మాఘ శుద్ధ దశమి

6-2-1998

# కృతజ్ఞతలు

అచ్చుపుస్తకం అందంగా రావటానికి దాని పనితనం తెలిసిన వారెంత అవసరమో అలాగే అదినిర్దుష్టంగా రావటానికి అచ్చుప్రతిని వ్రాసే వ్రాయసకాడు కూడ విజ్ఞుడై ఉండటం అంతే అవసరం. పూర్వకాలంలో ఈ లేఖకులు ఘంటం వారని ఉండేవారట. వారూరు తిరుగుతు గ్రామాలలో మకాంవేసి అవసరమైనవారికి తాళప్రతులు వ్రాసిపెట్టి ప్రతిఫలం తీసికునేవారట. ఆకాలంలో భాగవతం వ్రాస్తే ఒక పాడిగేదెనిచ్చేవారట. ఈ విషయం మాబామ్మగారి సోదరుడు మేడి పూరునారాయణగారు చేప్పేవారు.

పూర్వం మా యింటిలో తాళపత్ర గ్రంథ సంపద చాలా ఉండేది. మా తాతగారు వారి తండ్రిగారు మా తాతగారికి అగ్రజుల కోటిలోని వారైన మొలుగర రామచంద్రయ్యగారు వీరంతా మా కుటుంబంలోని తాళపత్ర లేఖకులు.

మా ప్రపితామహుడు స్వయంగా భాగవతం ఉత్తర రామాయణం వంటి మహా గ్రంథాలు 15 తన దస్తూరీలో వ్రాసికున్నాడు. అంతేకాక ముకురాల వెంకట్రామయ్యగారి పుత్రుడు (?) కొల్లాపురం కంసలి రంగయ్య సురభి జగ్గయ్య దేశాయి, భట్టు సంజీవుడు, ఎల్లోజు, వట్టెంపాపయ్య ఆకుదోట ఎల్లయ్యగారి కుమారుడు గురుమూర్తి మామిళ్ల ముత్యాలు అనేవారితోగూడ తనకవసరమైన కావ్యాలు ఆంధ్రనామ సంగ్రహం వంటి నిఘంటువులు వ్రాయించుకున్నాడు. వీరిలో చివరి యిద్దరు మాసొంత ఊరివారే.

నాకుగూడ మా ప్రపితామహుని వలెనే నారచనలు శుద్ధ ప్రతులు చేసి పెట్టినవారు చాలమందే ఉన్నారు. వారిలోనాతోపాటుగా జాతీయోన్నత పాఠశాలలో పనిచేసిన మిత్రుడు శ్రీ పి. వీరయ్య గారొకరు.

ఉ॥ వ్రాసినవెల్ల నచ్చునకు వ్రాసి యొసంగెడు మిత్రముండున
భ్యాసవశాన నూహతెలియంగల లేఖక పాఠకుండునై
భాసిలు వాడు పాలమురివారను వీరయ వ్రాతకాడునే
జూసిన యంతలేడు సతి నూనుడు నాతని గాచుగావుతన్

అని అతనికి శుభాశంసలు పలుకుతూ

2. ఈ కృతిని సకాలంలో చక్కగా చకచకా డి.టి.పి. చేసియిచ్చిన శ్రీ గౌరీ గ్రాఫిక్స్ గారికి,
3. పుస్తకాన్ని ఆలస్యం చేయకుండా అందంగా ముద్రించియిచ్చిన శ్రీ దుర్గాప్రింటర్స్ గారికి,
4. కోరికమేరకు నా ఊహకు రూపకల్పన చేసి ముఖపత్ర రచవ గావించిన శ్రీ శీలా వీర్రాజుగారికి,
5. వీరిందరితోపాటు వినయ విధేయతలు గల ఛాత్రుడైన తనకెన్ని పనులున్నా ఈ ముద్రణా వ్యవహారన్నాంతా పర్యవేక్షించి సకాలంలో పుస్తకం బయటికి వచ్చేటట్లు చూసిన ఇమాముద్దీనుకు మరియు
6. నాకు అన్నివేళలా అన్ని రంగాలలో చేదోడు వాదోడుగా ఉండే మా చిరంజీవులకు ఈ కావ్య గణపతి సకల శుభాలు కలిగించవలెనని కోరుతున్నాను.

ఇట్లు
సంకలనకర్త

# ఆవిష్కరణ



కుడినుండి
B. బాల్నారాయణ, V. సత్యనారాయణ, M. శేఖర్ రెడ్డి, N. నరసింహశర్మ-హైకోర్టువకీలు, ఆవిష్కర్త
ఎడమ నుండి కపిలవాయి లింగమూర్తి, ఉమాసుతరావు, Y. దేవదానం.

# అంకితం



కుడినుండి కృతిభర్త B. బాల్నారాయణ M.B.B.S, కృతికర్త K. లింగమూర్తి, M.O.L.

# విషయ సూచిక

# ఇష్టదైవాభినుతి

సకలసుపర్వరూపుడు ప్రసన్నముఖుండరుణాంబరుండు వే
డుకలజెలంగువాడు పరుడుఁ గురుడై నిజభక్తకోటి దా
యక నిరతంబు దానకరుడై విలసిల్లు మహౌజనుండునా
యకమణినీశ్వరీతనయు నంచితభక్తి మదిందలంచెదఁ

# వినాయకుని వివిధరూపాలు

## విశ్వగణపతి

వెంకయ వెంకయ వేములతాతా
కనకాపండ్లు కామునిరూపు
ఏకాశంకులు వెలగాపండ్లు
దూదీపరుపులు దుప్పటిరేకులు
నల్లనిగుడిలో తెల్లని వెంకయకు
నాలుగు చేతుల నమస్కారము - జానపదం

చ॥ తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటినందన నీకు మ్రొక్కెదన్
ఫలితముసేయుమయ్య నిను బ్రస్తుతి జేసెద నేకదంత మా
వలపలిచేతిగంటమున వాక్కుననెప్పుడు బాయకుండు మా
తలపులోన నీవెగతి దైవ వినాయక లోకనాయకా !

ఉ॥ తుండము ఏకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
వెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొకగుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన్

*"పెద్దబాలశిక్ష"* *పూడూరు సీతారామశాస్త్రి*

వినాయక కుమారస్వాములిద్దరు పార్వతీపరమేశ్వరుల పుత్రులు. వీరిలో ఎవరుకూడ వారి కడుపున పుట్టినవారు కాదు. గణపతి కేవలం పార్వతీ తనయుడు కాగా కుమారస్వామి శివుని యొక్క కుమారుడైనాడు.

గణపతి సృష్టికంతా ఆదిదైవం దేవగణాలకధిపతి. అతని పూజచేయకుండా ఏ శుభకార్యం జరుగదు కాబట్టి జగత్తు కాది దంపతులైన శివపార్వతుల వివాహంలోకూడ అతని పూజచేయబడింది. అందుకొరకు నేనుగూడ యిపుడు సముద్రజలంతోనే సముద్రుని కర్ఘ్యం యిచ్చినట్లు కావ్యగణపతి అష్టోత్తరమైన ఈ సంకలన కృతికి మొదట యిందలి గణపతినే నేను నుతిస్తున్నాను.

## 1. అంతరిక్ష గణపతి

భాద్రపదశుద్ధ చవితినాడు సూర్యోదయానికి ముందు ఏనుగు మరియు ఎలుక ఆకారం గల నక్షత్రాలు తూర్పున ఉదయిస్తవి. కనుక యిది గణపతికి అతని వాహనానికి కారణం ఇవే నక్షత్రాలు ఫాల్గుణ శుద్ధ చవితినాడు సూర్యాస్తమయం తర్వాత మళ్ళీ తూర్పుననే కనిపిస్తవి.

ఆషాఢ శుద్ధైకాదశి నుండి కార్తీకశుద్ధైకాదశివరకు చాతుర్మాస్యలు కనుక ఈ దినాలలో యతులుగాని బ్రాహ్మణులుగాని ఎక్కడా కదలరు. వారు తమ యిండ్ల దగ్గరే ఉండి చదువులన్ని వల్లెవేసికుంటారు. గణాలంటే చదువులు కనుక గణపతి విద్యాధిదేవతయైనాడు. ఈ చవితినాడు సామవేదులు ఉపాకర్మ గూడ చేస్తారు.

జ్యోతిషవేత్తలు మన నక్షత్ర మండలాన్ని ఉత్తర మార్గం దక్షిణమార్గం మధ్యమార్గం అని మూడు మార్గాలుగా ఒక్కొక్క మార్గాన్ని మళ్ళీ మూడు వీధులుగా విభజించినారు. ఆ లెక్క ప్రకారం అశ్విన్యాదిగా మూడేసి నక్షత్రాలొక మార్గంగా ఏర్పడుతవి.

నాగవీధి - గజవీధి - ఐరావత వీధి (ఉ) ఆర్షవీధి, గోవీధి జారద్గవి వీధి (మ) అజవీధి, మృగవీధి, వైశ్వానరవీధి (ద) అని ఆ వీధులపేర్లు ఈ వీధుల ప్రకారం ఆర్ద్రా నక్షత్రం గజవీధిలో ఉంటుంది. మొదట ఆ నక్షత్రం వృషభరాశిలో ఉండగా అవకాహడ చక్రంలో దాన్ని వృషభరాశి నుండి తొలగించి మిధునరాశిలో చేర్చినారు. అనగా గజవీధి నుండి తొలగించినారు. కాబట్టి ఈ సంఘటన వినాయకుని కథలో గజాసుర సంహారంగా చెప్పబడింది.

వినాయక చతుర్థి సూర్యుడు సింహరాశిలో ఉన్నపుడు వస్తుంది. మన శమంతకమణిలోని ఆమణి సూర్యుడు. సింహరాశి సింహం. సప్తర్షి మండలాన్ని ఎలుగుబంటి అంటారు. కాబట్టి అది జాంబవంతుడు - శ్రీకృష్ణుడు సూర్యుని కనుగొనటం అతనికి శమంతకమణి లభించటం. ఈ నక్షత్ర సన్నివేశాన్ని పురాణకర్తలు శమంతక మణి కథగా మలిచినారు.

## 2. దేవలోక గణపతి

వినాయకుడీ బ్రహ్మాండానికి ప్రధానమైన దేవత అతని అవతారాలనేకమున్నవి. అతడు కల్పానికొక తీరుగా వేర్వేరుగా పిలువబడుతుంటాడు. ఏ కల్పంలోనైనా అతడు పార్వతీ పరమేశ్వరుల పుత్రుడుగానే చెప్పబడుతుంటాడు. అయితే అతడు అవతరించటమేగాని పుట్టడమంటూ ఉండదు. సప్తకోటి మహామంత్రాలు ఒక్క గణపతి ఆగమంలోనే ఇమిడి ఉన్నవి. స్కాంద పురాణంలో శివుడు కుమారస్వామికి విష్ణు - శివ - శక్తి - గణపతి సూర్యులనే అయిదుగురికి భేదం లేదని చెప్పినాడు. అందుచేతనే శంకరాచార్యుడు పంచాయతన పూజ నేర్పరచినాడు. యిపుడు హిందువులు పూజించే వివిధ దేవతు ఏదో ఒకవిధంగా ఈ పంచాయతనంలో యిమిడిపోతూనే ఉంటారు. కాబట్టి ఆస్తికులకీ పంచాయతన పూజ చాలా ముఖ్యం. యిక పంచాయతనంలో గూడ గణపతియే అందరికంటె ముఖ్యుడు.

## 3. ప్రపంచ గణపతి -

గణపతి సార్వకాలిక - సార్వదేశిక - సార్వభౌమికమైన సర్వమత దైవం. అతనిని

1. ఇండో చైనా - చతుర్ముఖుడు
2. ఈరాక - కోటు పంట్లాం ధరించిన శేషపాణి
3. గ్రీక్ - ఓరెనెస్ (అరుణాస్య)
4. జపాన్ - వినయక్ష ( వినయయక్ష)
5. టిబెట్ - చోప్రక్ (శూర్పకర్ణ)
6. పార్సీ - అహురమజ్ద (అసురమర్ద)
7. బాలీద్వీపం - త్రినేత్రుడు
8. మంగోలియా - ప్రాహకెన్నె
9. సయాం - త్రిశిరుడు
10. జంబూ ద్వీపం - వినాటక
11. చైనా అంతర్భాగం - భజలిక
12. ఈజిప్టు - ఏక్పన్ (ఏకదంతుడు)
13. కాంబోడియా - చతుర్ముఖుడు
14. చైనా - కనెక్టివ్ (కంకటీక)
15. జావా - రుండమాలి
16. నేపాల్ - పంచముఖుడు
17. బర్మా - మహాపియన్నె (పిళ్లై)
18. బోర్నియో - మహాబలి
19. రోమ్ - గణస్ (గణేశ)
20. సింహళం - ఏనుగు తలగల యక్షుడు
21. జపాన్ అంతర్భాగం - కాంగ్‌టెన్
22. మంగోలియా అంతర్భాగం - దోత్‌కార్

అని ఈ విధంగా వివిధ నామాలతో పిలువబడుతూ వేర్వేరు రూపాలతో పూజింపబడుతున్నాడు. ఇవిగాక గణేశుని ప్రతిమలు ఆఫ్ఘనిస్తాన్, అమెరికా - పెరూ - మెక్సికో దేశాలలో గూడా లభించినవి.

## 4. చారిత్రిక గణపతి -

మనదేశంలో క్రీ.శ. రెండవ శతాబ్దంలో హవిష్కుని నాణేలపై గణపతి బొమ్మ ముద్రింపబడింది. గ్రీక్‌దేశంలో హెర్మైన్ అనే ప్రభువు గూడ తన నాణేలపై ఇతని బొమ్మను ముద్రింపించినాడు. 4వ శతాబ్దంనాటి సముద్రగుప్తుని శాసనంలో వినాయకుని ప్రస్తావన ఉంది. 5వ శతాబ్దంలోని గుప్తుల ఆలయంలో మొదటి వినాయనక ప్రతిమ కనుగొనబడింది. ఇవి మనదేశంలోని చారిత్రకాధారాలు.

శాతవాహనుల కాలంలో మూసీనదికి మూషక్రనది అనిపేరు. దాని తీరంలో మూషక్ర నగరం అనే పెద్ద పట్టణం ఉండేది. దాన్ని మూషక్ర వంశీయులు పాలించేవారు. వారిని హస్తివ వంశీయులు చిత్తుగా ఓడించి వారితో పల్లకీలు పట్టించుకొని ఊరేగినారట. ఈ సంఘటననే వినాయకునికి మూషకాన్ని వాహనం చేసిందని కొందరు చారిత్రికుల మతం. ఈ మూషకనది హర్యాణ రాష్ట్రంలోనిదని కొందరి అభిప్రాయం.

## 5. కర్షక గణపతి -

పూర్వం రైతులకు తమ పైరు పంటలే దైవం. వారు పండిన ధాన్యాన్ని గాదెలలో పురులలో నింపేవారు. పురులు గట్టిగా ఉండటానికి వానిని గడ్డితో వెంటులు పేని బిగించేవారు. శ్రావణ భాద్రపదాలు రాగానే తమగాదెలు నిండవలెనని వానిని పూజించేవారు. ఈనాటి వినాయకుని తొండం పండిన పంటను తలపై మోసుకుని వచ్చేదానికి చిహ్నం. అతని లంబోదరం గాదెకు సంకేతం. కళ్లాల నూర్పిడులలో తూర్పారపట్టే అందుకుపయోగపడే చేటలు అతని చెవులు. పొలం దున్నే బంటపంట నాగలి అతని ఏకదంతం శ్రావణ భాద్రపదాలలో పొలాలలో పాముల బెడద ఎక్కువ కాబట్టి అవి వినాయకుని భూషణాలు. వ్యవసాయ దారులకు త్రాళ్లు కొడవళ్లు అవసరం కాబట్టి పాశం కుంతం పంటలరూపాలైన చెఱుకు మామిడిపండు అతని చేతులలోని ఆయుధాలు గాదెలకు గండడైన ఎలుక అతనికి వాహనం. ఈ విధంగా ఇవన్ని కలిపి ఈనాటి వినాయకుని రూపం సృజింపబడిందని సాంఘికవేత్తల భావన. ఇది గ్రామీణ గణపతి కల్పన.

ఇతనిని గురించి రెండు రకాల కథలు - అనగా ఒకటి వినాయకుడు ఏనుగు తలతోనే పుట్టినాడని - అదికాదు నడుమ అతని కేనుగుతల అతికించబడిందని గాథలున్నవి.

ఈనాటి మానవులకు ఒక రూపం స్థిరపడి ఉన్నా అపుడపుడక్కడక్కడ ప్రకృతి విపరీతమైన జననాలు ఇంకా పూర్తిగా అడుగంటలేదు.

మన పురాణాలలో శివుని పరివారంలోని ప్రమథులంతా వివిధమైన జంతు వికారాకారాలు గలవారే. ఈనాటి మానవులకు ఒక స్థిరరూపం నిలిచిపోయినా ఈ మానవజాతి ఒకపుడు జంతువర్గంనుండియే రూపొందింది. కాబట్టి యింకా అక్కడక్కడ తలపై కొమ్ములు మొలిచే

శృంగీశ్వరులను పుట్టుకతోనే తోకలుగల వాలి వారసులను మనం అపుడపుడు పత్రికలలో చదువుతూనే ఉంటాం. ఫ్రాన్సులో ఒకపుడు మాదిల్డ్ అనే ఒక యువతికి "మైకెల్" అనే కుమారుడు పూర్తిగా కోడిపుంజు ఆకారంలో కలిగినాడట. అతనికి తలపై వెంట్రుకలకు బదులు కోడి యీకలు పాపిడిలో జుత్తువలె ఎర్రని కండ కోడిపుంజు మూతివంటి వంకర తిరిగిన ముక్కు ఉండగా ఆ బాలుడు యువకుడైనపుడు లయన్స్ డాక్టర్ల బృందం ఆ రూపాన్నొక సవాలుగా తీసికొని పరిశోధనలు చేసిన పిదప డాక్టర్ బర్నాల్డ్ అనే అతడు అతని తలపై గల చర్మాని వొలిచివేసి మామూలు మనిషిని చేసినాడట (1989 నవంబరు 20 ఆదివారం ఈనాడు) చైనా దేశంలో లియావోత్సింగ్ రాష్ట్రంలో ఒక దంపతులకు శరీరమంతా పుట్టుకుచ్చువంటి మెత్తని రోమాలుండే బాలుడు కలిగినాడట. అతనిపేరు యుచెక్‌హువాక్. అతని రోమనిర్మూలన కోసం డాక్టర్లు ఒక సంవత్సరం పాటు చికిత్సచేసి విసిగి ఊరుకున్నారట. ఆ బాలుడిపుడున్నాడట. (11-4-1990 ఆంధ్రప్రభ). లండన్‌లో ఒక పేద కుటుంబంలో "జోసెఫ్ మెర్రిర్" అనే ఒక బాలుడు తొండం తప్ప పూర్తిగా ఏనుగువంటి ఆకారంగా దళసరి చర్మంతో జనించినాడట. పేదతనం కారణంగా తల్లిదండ్రి ఆ పిల్లవానికి ఏ చికిత్స చేయలేకపోయినారట. అతడు విచిత్ర వేషధారణతో కాలం గడుపుతూ ఉండగా విక్టోరియా సర్కస్ వారతనిని తమ సర్కస్‌లో 10 సంవత్సరాలు కంట్రాక్టుకుదుర్చుకొని దేశదేశాలు త్రిప్పినారట.

ఒకప్పుడొక సర్కసులో పూర్తిగా గెరిల్లా వంటి స్త్రీ యుండెనట. ఆమెను సర్కస్‌లో ప్రదర్శనకు కుదిరించుకొని దానిని విడిచివెళ్లకుండ మేనేజరామెను వివాహమాడి యుండెనట.

వెస్ట్ వర్జీనియాలోని 'జువాలజిస్టు "రాడిలాన్" మరియు అతని పరిశోధక బృందానికి "సెనెరాక్స్" అనేచోట గుహలలో ఒక గబ్బిలం బాలుడు దొరికెనట. అతని శరీరమంతా మానవాకారంగా ఉండి ముఖం మాత్రం అసాధారణంగా పక్షులకు జంతువులకు ఉండే ముఖంవలె ఉండెనట. (15-1-1993 స్వాతి వార పత్రిక). నెదర్లాండులోని అమ్‌స్టర్‌డామ్‌లోగల డాక్టర్ పీటర్ డిప్రేన్ మనిషితలగల గుర్రాన్ని పుట్టించి దానికి "మాన్సీ" అని పేరు పెట్టెనట. (31-1-1992 స్వాతి సపరివార పత్రిక) ఇవన్నీ విచిత్రమైనవే కాదు సచిత్రమైన వార్తలు కనుక ఇట్టివి చూచినపుడు వినాయకుని జననం మనకేమి వింతగా తోచదు.

పసిపిల్లలకు మాటలారంభమైన కాలంలో "మ" అని వారు పలికే అపుడు తల్లులు మకారాన్ని సవరించి అమ్మ అని తకారాన్ని సవరించి అత్త అని రూపొందింపజేస్తారు. అలాగే వినాయకుని జననం గూడ మొదట గజముఖానికి దగ్గరగా ఉండవచ్చు. తర్వాత తర్వాత కవులు దాన్ని పూర్తిగా తుండం దంతాలు గల గజముఖంగా మలిచినారు.

ఇక రెండవ పక్షంలో ఈనాడు మానవులకు అంగాల మార్పిడి అంటె కంటిపొరలు, మూత్రపిండాలు, గుండెవంటివి మామూలై పోయినవి. కాని ఒకప్పుడివిలేవు. మన పురాణాలలో మాత్రం వీరభద్రుడు భృగుమహర్షి మీసాలు పెరికివేయగా అశ్వినీదేవతలతనికి మేకపోతు వెంట్రుకలతో

ుడ్డం మీసాలు అమర్చినట్లు గౌతముని శాపంతోయింద్రుదఫలుడు కాగా అతనికి మేకపోతు ృషణాలతికించినట్లు కథలున్నవి.

ఈనాటి గుండెమార్పిడికి ప్రథమ ప్రయత్నంగా శాస్త్రజ్ఞులు మొదట చికిత్సకునికి ఒక కోతిగుండె నమర్చిరట. ఇపుడు పంది గుండెలమర్చుతున్నారు - ఇక రక్తం మార్పిడికి మొదటిసారిగా ఒక గొర్రె రక్తాన్ని ఎక్కించిరట అవి ఫలించలేదు. గాని జంతువుల భాగాలు మానవుల కుపయోగించటానికివి ఒక ఉదాహరణలు.

జర్మనీలోని ఈస్ట్ బెర్లిన్‌లో గ్రెటిక్ అనే ఒక ఆడ చింపాంజీకి మరణించిన ఒక టీనేజ్ యువకుని మెదడును అమర్చినారట. ఈ ప్రయోగం సోవియట్ యూనియన్ ఈస్ట్ జర్మన్ డాక్టర్లు కలిసి నిర్వహించగా ఆ చింపాంజీ కోలుకుని జర్మనీ భాషను మాటాడుట ప్రారంభించిందట. (24-7-1992 స్వాతి) ఈ మెదడు నమర్చటమే గాక చింపాంజీకి ఏకంగా మానవ శిశువునే పుట్టించినట్లు ఒకప్పటి మయూరి వార్త. కాబట్టి జంతువుల అంగాలుమానవులకెంత వరకతుకగలవనేది ఇంకా యిప్పటికీ విజయం కాకున్నా ఇకముందు కావచ్చు. కాబట్టి ఆనాటి వినాయకునికి ఏనుగతల నతికించటం "హెడ్ గ్రాఫ్టింగ్" అని పాలెం వ్యవసాయ పరిశోధనాలయం డైరెక్టరు శ్రీ డి. నారాయణగారు అంటారు.

ఇక అతని వాహనాన్ని గురించి ఆలోచించినపుడు ఈనాడు ఆఫ్రికా ఖండంలో ముప్పది నలువది కిలోల బరువు అవలీలగా మోయగలిగిన ఎలుకలున్నవట. కాబట్టి ఇపుడే అంత బరువు మోయగలిగిన ఎలుకలున్నపుడు పురాణకాలం నాడు వినాయకుని మోయగలిగిన ఎలుకను గురించి ఆశ్చర్యపడ నవసరముండదు.

ఇపుడు మన దేశంలో పెంపుడు జంతువుల మోజు తక్కువగాని పాశ్చాత్యదేశాలలో మనం క్రూరజంతువులని తలిచే పులి, సింహం, ఎలుగుబంటి, మొసలి, కొండచిలువల వంటి వానిని గూడ సాకి వానితో స్నేహం చేసి ఆడుకునేవారున్నారు.

ఇపుడు మన దేవతలకు వివిధమైన పశుపక్షులు వాహనాలుగా కనిపిస్తుంటవి. దేవతా యుగంనాటి వారు ఈనాటి పాశ్చాత్యుల వలె వానిని మచ్చిక చేసి ఏదోవిధంగా వానిని తమ అవసరాలకుపయోగించుకునే వారని సమాధానపడవలసి ఉంది.

వినాయకాలయాలు కర్నాటకలో షిరాలి, షిర్షి గోకర్ణంలో గూడ ఎక్కువ. మహారాష్ట్రంలో గాణాపత్యం బాగా వ్యాప్తిలో ఉంది. వారిలో మహాగణపతి, హరిద్రా గణపతి, స్వర్ణగణపతి, ఉచ్ఛిష్ట గణపతి, సంతాన గణపతి, నవనీత గణపతి అని గణపతి ఉపాసకులలో భేదాలున్నవి. పూనాలో అష్టగణపతి ఆలయం ఉంది. బెంగుళూరులోని బసవన గుడిలో పదహారడుగుల యెత్తు వినాయకుడున్నాడు. అక్కడి పద్మశాలీతో వినాయకుని తమ యింటిలోని వస్త్రాలను ఎలుకలనుండి రక్షించమని ప్రార్థిస్తుంటారు. మరో విశేషమేమిటంటె సింహాచలంలో స్వామికి చందనం పట్టించి ఏటా

ఒకసారి వలిచి నట్లక్కడ స్వామికి వెన్నను పూసి పైన బంగారు పన్ని అంటించి మూడు దినాలుంచి మూడవనాడా వెన్నను వలిచి దాన్ని మళ్లి తెచ్చిన వారికే యిస్తారట. ఈ స్వామికి నూరు కేజీల వెన్నపడుతుందట. ఇదొక విచిత్రం. భాద్రపద శుద్ధ చవితినాడు గణపతిని మట్టితో చేసి పూజించవలెనని శాస్త్రం. ఈనాడు ఈ మట్టి బొమ్మల దొక పరిశ్రమగా మారింది. బొంబాయిలో ఏటా నలువది లక్షల వినాయక ప్రతిమలు నిమజ్జనం చేస్తారట. అక్కడ "పెన్" అనేచోట ఈ విగ్రహాలు తయారుచేయబడి ఏబది గణేశ మండలాల ద్వారా ఊరూరికి ఆ తర్వాత యింటింటికి అందజేయబడుతూ ఉంటవట.

ఆంధ్రప్రదేశ్‌లో యిపుడు హైదరాబాదుగూడ వినాయక ప్రతిమలకు ప్రసిద్ధిగా ఉంది. ధూల్‌పేటలో ఏటా కొన్నివేల ప్రతిమలు సిద్ధమైతుంటవి. ఎందరో కళాకారులకు ఈ పరిశ్రమ జీవనోపాధిగా కూడ ఉంది.

## పురాణ గణపతి

శ్రు- ఓం గణానాం త్వాగణ పతిగ్ం హవామహే! కవింకవీనాముప
శ్రవస్తవం జ్యేష్ఠరాజం బ్రహ్మణస్పతిం అనువృణ్వన్
నూతిభిస్సీ దసాదనం

తా :- గణపతి సృష్టికి మూలదైవం. మరియు సృష్టిలో మొదటి దేవుడు. అతడు దేవగణాలకంతా అధిపతి. కవులకు కవి రాజులలోమొదటివాడు. వేదాలతనిని బ్రహ్మణస్పతి అని పొగడినవి.

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే.

తా :- గణపతి అనేది ఒక పదవి. దానిని దేవతలలో అనేకులధిష్ఠించినారు. దీనిపై మొదట అధిష్ఠించినవాడు శ్వేతద్వీపవాసియైన విష్ణువు. అతడు చతుర్భుజుడు. తెల్లని వస్త్రాలు గలవాడు. ప్రసన్న వదనుడు. సర్వవిఘ్నాలు నివారించేవాడు. ప్రసన్నమనగా మదించిన ఏనుగు. జాపాన్‌లోని వినాయక మూర్తులన్ని ప్రసన్నవదనంగాగాక దరహాసవదనంగా ఉంటవి.

శ్లో॥ అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే ।

తా :- విష్ణువు పిమ్మట ఈ పదవిపై శివపార్వతుల కుమారుడైన గణపతి అధిష్ఠించినాడు. అతడు మొదట అందరు దేవతలవలె దేవశిరం కలవాడే. శనైశ్చరుని దృష్టితో ఆ తలపగిలిపోగా అతనికి పరమేశ్వరుడు ఏనుగుతల నతికించి బ్రతికించినట్లు పురాణగాథ.

ఈ వినాయకుడు కూడ మొదట ద్విరద వదనుడే. అనగా రెండు దంతాలుకలవాడు. అనంతరకాలంలో పరశురామునితో ఒక దంతం విరగగొట్టబడి ఏకదంతుడైనట్లొక గాథ.

ఈ గణపతి మొదట బ్రహ్మచారి. ఆ పిమ్మట విశ్వరూప ప్రజాపతి బిడ్డలైన సిద్ధి - బుద్ధి అనే యిద్దరు భార్యలను చేసికొని అందరు దేవతలవలె దేవీసతాతుడైనాడు. కాని యితనిక బ్రహ్మచారిగానే ఎక్కువ ప్రసిద్ధి.

మన దేవతలందరూ సహస్రనాములు. దినదినం సహస్రనామ పారాయణం చేయలేకున్నా ఆస్తికులు తమ యిష్టదైవం యొక్క అష్టోత్తరమైనా పూజావసరంలో చెప్పుకోవలె. ఇది సంప్రదాయం.

బ్రహ్మవైవర్త పురాణంలోని గణపతి ఖండం.

శ్లో॥ గణేశమేకదంతంచ హేరంబంచ వినాయకం
లంబోదరం శూర్పకర్ణం గజవక్త్రం గుహాగ్రజం.

తా :- గణేశుడు, ఏకదంతుడు, హేరంబుడు, వినాయకుడు, లంబోధరుడు, శూర్పకర్ణుడు, గజవక్త్రుడు, గుహాగ్రజుడు. అని ఎనిమిది పేర్లు ప్రధానమైనవిగా చెప్పింది.

## నారద పురాణం -

ప్రధమం వక్రతుండంచ, ఏకదంతం ద్వితీయకం,
తృతీయం కృష్ణ పింగాక్షం - గజవక్త్రం చతుర్థకం
లంబోదరం పంచమంచ, పుష్పం వికటమేవచ
సప్తమం విఘ్నరాజంచ, ధూమ్ర వర్ణం తథాష్టమం,
నవమం ఫాలచంద్రంచ, దశమంతు వినాయకం
ఏకాదశం గణపతిం, ద్వాదశంతు గజాననం.
ద్వాదశైతాని నామాని, త్రిసంధ్యాయః పఠేన్నరః
నచవిఘ్న భయంతస్య, సర్వసిద్ధి కరం ప్రభో ॥

తా :- వక్రతుండుడు, ఏకదంతుడు, కృష్ణపింగాక్షుడు, గజవక్త్రుడు, లంబోదరుడు, వికటుడు, విఘ్నరాజు, ధూమ్రవర్ణుడు, ఫాలచంద్రుడు, వినాయకుడు, గణపతి, గజాననుడు, అనే పన్నెండు పేర్లు ముఖ్యమని చెప్పింది.

## ఆర్ష పద్ధతిలోని పూజా విధానాలు -

శ్లో॥ సుముఖశ్చైక దంతశ్చ, కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో వినాయకః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణః హేరంబస్కంధ పూర్వః

షోడశైతాని నామానియఃపఠేచ్ఛృణు యాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశేనిర్గమేతధా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే.

తా :- సుముఖుడు, ఏకదంతుడు, కపిలుడు, గజకర్ణుడు, లంబోదరుడు, వికటుడు, విఘ్నరాజు, వినాయకుడు. ధూమకేతువు, గణాధ్యక్షుడు, ఫాలచంద్రుడు, గజాననుడు, వక్రతుండుడు, శూర్పకర్ణుడు, హేరంబుడు. స్కందపూర్వజుడు. అనేపదారుపేర్లు ముఖ్యమని ఇవి సమస్త శుభకార్యాలకుముందు స్మరించవలెనని, అట్లా స్మరించిన వారికే ఆటంకాలు కలుగవని చెబుతున్నవి.

శ్లో॥ దేహోదేవాలయప్రోక్తః జీవోదేవస్సనాతనః
త్యజేదజ్ఞానన నిర్మాల్యం సో2హం భావేన పూజయేత్ ॥

తా :- ఈ దేహమే ఒక దేవాలయం, ఇందలి జీవుడే సనాతనుడైన దేవుడు కనుక అజ్ఞానం అనే నిర్మాలాన్ని తొలగించి అతనిని సోహం భావంతో అనగా అతడే నేననే ధ్యాసతో ఆరాధించవలెనని మోక్షమార్గాలు చెబుతున్నవి.

మానవ దేశం.

శ్లో॥ రసాసృజ్మంస మేదో2స్థి మజ్జా శుక్రాది ధాతవః

తా :- రక్తం, మాంసం, చర్మం, మేధస్సు, స్నాయువు, అస్థి, మజ్జ అనే ఏడు ధాతువులతోను, పృథివి, అప్పు, తేతస్సు, వాయువు, ఆకాశం మహాత్తత్వం, అహంకారం - అనే సప్తావరణలలోను కూడి ఉంది కనుక ఈ దేహానికి ప్రతీకలైన మన ఆలయాలు గూడ ఏడు ఆవరణలు అనగా ఏడు ప్రాకారాలు కలిగి ఉంటవి. శ్రీరంగంలోని ఆలయంలో ఈ ఏడు ప్రాకారాలు యిపుడు చూడవచ్చు. కాశీఖండంలో కాశీ పట్టణం గూడ సప్తావరణ వృతమై ఉన్నట్లు ఆ ఆవరణలో ఒక్కొక్క దానిలో ఎనిమిది దిక్కులలో కూడ గణపతులు రక్షణకై నిలిచి ఉన్నట్లు చెప్పబడింది.

ఆ యొక్క 7×8 = 56 ఏబదారు గణపతుల పేర్లు వినండి.



# కాశీపట్టణంలో షట్పంచశద్వినాయకుల పేర్లు

| | ప్రధమావరణం | ద్వితీయావరణం | తృతీయావరణం | చతుర్థావరణం | పంచమావరణం | షష్ఠావరణం | సప్తమావరణం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | అర్క | లంబోదర | వక్రతుండు | అభయద | స్థూలదంత | మణికర్ణిక | మోద |
| 2. | దుర్గ | కూటదంత | ఏకదంత | సింహతుండ | కలిప్రియ | ఆశ | ప్రమోద |
| 3. | భీమచండ | కాలకంటక | త్రిముఖ | కూణితాక్ష | చతుర్దంత | సృష్టి | సుముఖ |
| 4. | ఢేల్లీ | కూష్మాండ | పంచాస్య | క్షిప్రప్రసాద | ద్వితుండ | యక్ష | దుర్ముఖ |
| 5. | ఉద్దండ | ముండ | హేరంబ | చింతామణి | జ్యేష్ఠ | గజకర్ణ | గణనాథ |
| 6. | పాశపాణి | వికటదంత | విఘ్నరాజ | దంతహస్త | గజ | చిత్రఘంట | జ్ఞాన |
| 7. | ఖర్వ | రాజపుత్ర | వరద | పిచండిల | కాల | స్థూలజంఘ | ద్వార |
| 8. | సిద్ధి | ప్రణయ | మోదక | ఉద్దండ | నాగేశ | మంగళ | అవిముఖ |

అనే వినాయకులున్నారు. ఈ ఏబదారు పేర్లు ఎవరు దినదినం స్మరిస్తారో వారి ఆటంకాలన్ని తొలగిపోతుంటవి.

# పూజాగణపతి

రూప ధ్యాన రత్నావళిలో ముప్పది రెండు గణపతి రూపభేదాలు చెప్పబడినవి. వాని వివరాలు వినండి.

## 1. బాలగణపతి :-

బాలుడైన యితడు లేత సూర్యుని రంగు గలిగి నాలుగు చేతులు గలిగి తొండంతో "కుడుం" పట్టుకుని ఉంటాడు. చేతుల్లో

| కుడివైపు | ఎడమువైపు |
|---|---|
| 1. అరటిపండు | 2. చెరుకుగడ |
| 3. మామిడిపండు | 4. పనసపండు |

ధరించి ఉంటాడు. తొండంతో మోదకంగాక వెలగపండు ధరించి ఉంటాడని మతాంతరం. వేలూరుకోటలో దోగాడుతున్న బాలగణపతి మూర్తి ఉంది. ఉడిపికి 30 మైళ్లదూరంలో గల వరాహీ నదీతీరంలోని "హట్టిఅంగడి"లో సాలగ్రామ శిలలో మంచబడిన బాలగణపతి ఉన్నాడు. అతనికి తలపై చిన్నముడి వెనుకవైపు వ్రేలాడే ఉంగరాల జుట్టు ఉంది. ఈ స్వామిని అక్కడివారు పొకపూతో పూజిస్తారు. ఈ గాడిచుట్టు 32 గణపతి భేదాలమూర్తులున్నవి.

## 2. తరుణ గణపతి :-

లేత సూర్యుని రంగుతో అష్టభుజుడై ఉంటాడు. చేతుల్లో

| | |
|---|---|
| 1. అంకుశం | 2. పాశం |
| 3. వరికంకులు | 4. చెరుకుగడ |
| 5. వెలగపండు | 6. నేరేడుపండు |
| 7. దంతం | 8. కుడుము |

ధరించి ఉంటాడు. మతాంతరంలో ఇతడు షడ్భుజుడు తన చేతులలో పాశం, అంకుశం, వెలగ, నేరెడు, వెదురు, నూవులు ధరించి ఉంటాడు.

శ్రీశైల ప్రాకారంపై వేణువు పూరించే గణపతి ఉన్నాడు.

## 3. భక్త గణపతి :-

శరత్కాలమేఘం వంటివాడు. చతుర్భుజుడు. చేతుల్లో

1. అరటిపండు 2. కొబ్బరికాయ

3. మామిడిపండు 4. గుడాన్నపాత్ర

## 4. వీరగణపతి :-

| అరుణవర్ణుడు - షోడ శభుజుడు | | మతాంతరంలో | |
|---|---|---|---|
| 1. చక్రం | 2. గాలం | 1. వేలాయుడు | 2. శక్తి |
| 3. కత్తి | 4. పాశం | 3. ధనువు | 4. బాణం |
| 5. శూలం | 6. శక్తి | 5. ఖడ్గం | 6. ఖేటకం |
| 7. ముద్గరం | 8. ఖట్వాంగం | 7. ముద్గరం | 8. గద |
| 9. కుంతకం | 10. ధ్వజం | 9. అంకుశం | 10. పాశం |
| 11. పరశువు | 12. గరు | 11. శూలం | 12. పరశువు |
| 13. అంకుశం | 14. నాగం | 13. ధ్వజం | 14. జలకలశం |
| 15. బాణం | 16. విల్లు | 15. అభయముద్ర | 16. వరదముద్ర |

తన చేతులలో ధరించి ఉంటాడు.

## 5. శక్తి గణపతి :-

వినాయకుడు బ్రహ్మచారి. హిందూదేవతలందరు దేవితోకూడి ఉన్నారు. కాబట్టి వినాయకుని బ్రహ్మచారిగా ఉంచటం తాంత్రికులిష్టపడలేదు. తత్ఫలితంగా శక్తిగణపతి, ఉచ్ఛిష్ట గణపతి, లక్ష్మీగణపతి, మహాగణపతి, వల్లభగణపతి అనే మూర్తిభేదాలు రూపుదిద్దుకున్నవి.

ఈ గణపతి సంధ్యాకాలంలోని ఎరుపు పసుపు వర్ణములు కలిగి చతుర్భుజుడై ఎడమతొడపై దేవితో ఉంటాడు. దేవి ఆకుపచ్చ రంగు వినాయకుని చేతులలో

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. ఈచేత్తో దేవినాలింగనం చేసికొని ఉంటాడు.

కాని వారి యిద్దరి నడుములు తాకి ఉండరాదు.

## 6. ద్విజగణపతి :-

ఇతనికి బ్రహ్మగణపతి యని మరోపేరు. చంద్రుని వంటి కాంతిగలిగి చతుర్భుజుడై ఉంటాడు. చేతుల్లో

1. యోగదండం 2. కమండలం

3. జపమాల 4 పుస్తకం ఉంటవి.

కలకత్తాలోని మ్యూజియంలో పద్మంపై పద్మాసనాసేనయైన వినాయకి ఉంది. ఆమెకు యజ్ఞోపవీతం ఉంది. కాబట్టి ఇది ద్విజగణపతి స్త్రీ రూపం - దీన్ని బ్రాహ్మిగణపతి అంటారు.

## 7. సిద్ధ గణపతి :-

హేమపింగళవర్ణుడు, చతుర్భుజుడు చేతుల్లో

1. పరశువు 2. చెరుకుగడ

3. మామిడిపండు 4. పూలగుత్తి

ధరించి ఉంటాడు. శివపురాణంలో శ్రీదేవి, సమృద్ధదేవి యితని భార్యలుగా చెప్పబడినారు. సిద్ధగణపతి కాశిలోని ప్రధమావరణంలో ఉన్నాడు.

## 8. ఉచ్ఛిష్ట గణపతి :-

నీలవర్ణుడు చతుర్భుజుడు. తొండంతో దానిమ్మపండు ధరించి ఉంటాడు. చేతుల్లో

1. కలువపూవు 2. వరికంకి

3. జపమాల 4. వీణ ధరించి ఉంటాడు.

మతాంతరంలో ఇతడు షడ్భుజుడు. కమలం, దానిమ్మపండు, వీణ, వరికంకులు నాలుగు చేతుల్లో ధరించి, కుడిచేత అభయముద్రతో ఎడమచేత తొడపై కూర్చున్న దిగంబరదేవిని ఆలించనం చేసికొని ఉంటాడు.

శంకరాచార్యుని జన్మస్థానమైన కాలడీలో ఉచ్ఛిష్ట గణపతి మూర్తి ఉంది. కుంభకోణంలోని నాగేశ్వరాలయంలో ఉచ్ఛిష్ట గణపతికి ఉదాహరణమైన ప్రతిమ ఉంది. తెనాలి రామలింగని పేరగల బ్రహ్మానంద కావ్యంలో బాలుడైన ఉచ్ఛిష్ట గణపతి వర్ణింపబడినాడు.

## 14. విజయ గణపతి :-

ఆఫ్ఘనిస్తాన్‌లోని "గార్డేజ్" వద్ద ఒక పాలరాతి గణపతిమూర్తి ఉంది. దాని ఎత్తు 60 సెం.మీ., వెడల్పు 35 సెంటీమీటర్లు. ఇది గాంధార శిల్పం. దీన్ని సాహి వంశానికి చెందని పరమభట్టారక పింగళుడనే రాజు రాజ్యానికి వచ్చిన ఎనిమిదోయేట మహాజ్యేష్ఠ శు॥ 3 - విశాఖా నక్షత్రంనాడు సింహలగ్నంలో ప్రతిష్ఠించినాడు.

ఎర్రనివడు, చతుర్భుజుడు, మూషికవాహనుడు. చేతుల్లో -

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. మామిడిపండు ధరించి ఉంటాడు.

## 15. నృత్త గణపతి :-

పచ్చని కాంతి గలిగి కల్పవృక్షం క్రింద నాట్యం చేయుచున్నట్లుంటాడు. ఇతడు చతుర్భుజుడు కల్పనృత్త గణపతి అని ఇతనికి మరోపేరు. చేతుల్లో

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. గొడ్డలి

ధరించి ఉంటాడు. హళేబీడులోని హోయసలేశ్వరాలయంలో ముద్దులు మూటగట్టే నృత్తగణపతి ఉన్నాడు. ఈ ఆలయం క్రీ.శ. 1121 లో హోయసల విష్ణువర్ధనుడు ప్రతిష్ఠించినాడు.

దేవుని కడపలోని ప్రసన్న వేంకటేశ్వరాలయంలోను, నందికందిలోని రామేశ్వరాలయంలోను ద్రాక్షారామంలోని భీమేశ్వరాలయంలోను నాట్యగణపతి మూర్తులున్నవి. ఇంకా వివరాలకు - చరిత్రలో నృత్యగణపతి వ్యాసం డా॥ ఈమని శివనాగిరెడ్డి, బి. సుబ్రహ్మణ్యంగారలు చూ. 31 ఆగష్టు 1997 ఆదివారం ఆంధ్రప్రభ కాపి.

## 16. ఊర్ధ్వ గణపతి :-

సువర్ణ వర్ణుడు, అష్టభుజుడు, ఎడమతొడపై దేవి ఉంది ఎడమ చేయిపైకెత్తి ఉంటుంది. అందుకే యితడూర్ధ్వ గణపతి. చేతుల్లో

1. ఎర్ర కలువ 2. పద్మం

3. వరికంకి 4. గద

5. బాణం 6. చెరుకువిల్లు

7. దంతం 8. ప్రియురాలి ఆలింగనం చేసికుని ఉంటాడు.

## 17. ఏకాక్షర గణపతి :-

ఎర్రనికాంతి, ఎర్రని మూపూత, ఎర్రని దండలు, ఎర్రని వస్త్రం ధరించి స్థూలశరీరంతో పొట్టికాళ్లు చేతులు గలిగి తలపై నెలవంకతో, పాలనేత్రంతో, సర్పహారం కలిగి కమలంపై కూర్చొని ఉంటాడు. ఇతడు చతుర్భుజుడు. తొండంతో దానిమ్మపండు చేతుల్లో -

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. వరదముద్ర ధరించి ఉంటాడు.

నేపాలు దేశంలోని గణపతికి రకత్త గణపతి అని పేరు. అతడంతా ఎర్రనివాడు. సంస్కృతంలోని 51 అక్షరాలు ఓంకారంలోని వివిధ స్పందనలకు సంకేతాలు. గణపతి మొదటి వ్రాయసగాడు. అందుకే ఆయన అక్షరాలన్నిటికి అధిపతియై 51 రూపాలతో వెలసినాడు. వానిలో 32 రూపాలు శబ్దంలో ఒదిగి ఉన్న పరబ్రహ్మను సృష్టి రహస్యాన్ని గుర్తించేందుకు 16 రూపాలు పూజించేందుకు 3 రూపాలు ఉపాసించేటందుకు ఏర్పరచినారు కాబట్టి ఏకాక్షర గణపతి అనగా ఓంకారగణపతి అని తాత్పర్యం.

## 18. వర గణపతి :-

సింధూర కాంతి గలిగి తలపై నెలవంక, మూడవకన్ను, నాలుగు చేతులు కలిగి ఎడమ తొడపై దేవితో ఉంటాడు. దేవి కుడిచేత ధ్వజం, ఎడమచేత పద్మం ధరించి ఉంటుంది. ఈ గణపతి తొండంతో ధనపాత్ర, చేతుల్లో

1. అంకుశం 2. పాశం

3. మధుకపాలం 4. ప్రియురాలి కళాస్థానస్పర్శ కలిగి ఉంటాడు.

కాణిపాకంలో వరసిద్ధి వినాయకుడు, పూనా సమీపంలోని "మహడ్" లో వరవినాయకుడి ఉన్నారు.

## 19. త్ర్యక్షర గణపతి :-

బంగారు కాంతి, నాలుగు చేతులు, కదులుతున్న చెవులు కలిగి తొండంతో దానిమ్మపండు, చేతుల్లో

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. కుడుము ధరించి ఉంటాడు.

## 20. క్షిప్ర ప్రసాద గణపతి :-

ఎర్రనికాంతి తలపై నెలవంక ప్రకాశించే భూషణాలు ధరించి లావైన పొట్టతో వికసించిన తామరపై కూర్చొని తొండంతో దానిమ్మపండు ధరించి చతుర్భుజుడై ఉంటాడు. చేతుల్లో

1. అంకుశం     2. పాశం

3. దంతం     4. కల్పలత   ఉంటవి.

## 21. హరిద్రా గణపతి :-

పసుపురంగు కలిగి, పసుపు రంగు వస్త్రాలు ధరించి నాలుగుచేతులు కలిగి ఉంటాడు. ఇతనికి క్షిప్రగణపతి, నిశాగణపతి అనిగూడ పేర్లు. నిశా అతగా పసుపు. చేతుల్లో

1. అంకుశం     2. పాశం

3. దంతం     4. కుడుము   ధరించి ఉంటాడు.

## 22. ఏకదంత గణపతి :-

నల్లని కాంతి, లావైన పొట్ట నాలుగుచేతులు కలిగి ఉంటాడు. చేతుల్లో

1. జపమాల     2. పరశువు

3. దంతం     4. లడ్డుకం   ఉండవి.

సిద్ధిదేవి ఇతని భార్యగా చెప్పబడుతుంది. కాశిలోని తృతీయావరణంలో ఈ గణపతి ఉన్నాడు.

బర్మాలో లభించిన ఒక గణపతి గొడ్డలి, రుద్రాక్ష-శంఖం ధరించి ఒక చేతిని తొడపై ఉంచుకుని పద్మాసనాసీనుడై ఉన్నాడు.

## 23. సృష్టి గణపతి :-

ఎర్రనికాంతి గలిగిన చతుర్భుజుడు, మూషక వాహనుడై ఉంటాడు. చేతుల్లో

1. అంకుశం     2. పాశం

3. దంతం     4. మామిడిపండు   ధరిస్తాడు.

కాశీలోని షష్టావరణంలో ఈ వినాయకుడున్నాడు.

## 24. ఉద్దండ గణపతి :-

అరుణ వర్ణుడు ద్వాదశ భుజుడు. ఇతని ఎడమతొడపై ప్రియురాలుంటుంది. ఆమె పచ్చని రంగు కలిగి చేతిలో పద్మం ధరించి ఉంటుంది. ఈ వినాయకుని చేతుల్లో

| | |
|---|---|
| 1. అంకుశం | 2. పాశం |
| 3. వరికంకులు | 4. చంద్రుడు |
| 5. పద్మం | 6. నల్లకలువ |
| 7. పూవు | 8. రత్నకలశం |
| 9. దానిమ్మపండు | 10. గద |
| 11. దంతం | 12. చెరుకు విల్లు ఉంటవి. |

## 25. ఋణవిమోచక గణపతి :-

స్పటిక వర్ణంతో నాలుగుచేతులతో ఎర్రని వస్త్రాలు ధరించి ఉంటాడు. చేతుల్లో

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. నేరేడుపండు ఉంటవి. యితని భార్యపేరు సౌభాగ్యలక్ష్మి.

## 26. డుంఠి గణపతి :-

అరుణవర్ణుడు, చతుర్భుజుడు, చేతుల్లో

1. జపమాల 2. పరశువు

3. దంతం 4. రత్నపాత్ర ధరించి ఉంటాడు. కాశీలో అన్నపూర్ణ ఆలయం ప్రక్కన ఈ గణపతి ఉన్నాడు. ఇంద్రకల్లులో గూడ ఈ గణపతి మూర్తి ఉంది.

## 27. ద్విముఖ గణపతి :-

రెండు ముఖాలు నాలుగు చేతులు కలిగి ఇంద్రనీలవర్ణుడై ఎర్రని వస్త్రం, రత్నకిరీటం ధరించి ఉంటాడు. చేతుల్లో

1. అంకుశం 2. పాశం

3. దంతం 4. రత్నపాత్ర ఉంటవి. కాశీలోని పంచమావరణంలో ఈ గణపతి ఉన్నాడు.

## 28. త్రిముఖ గణపతి :-

మోడుగు పువ్వురంగుతో మూడు ముఖాలు ఆరు చేతులు కలిగి బంగారు వన్నెతో తామరలోని కర్ణికపై కూర్చొని ఉంటాడు. చేతుల్లో

1. అంకుశం  2. జపమాల
3. అమృతకలశం  4. అంకుశం
5. అభయముద్ర  6. వరదముద్ర  ఉంటవి.

కాశీలోని తృతీయావరణంలో ఈ గణపతి ఉన్నాడు.

## 30. యోగగణపతి :-

లేతసూర్యుని వంటి రంగుతో నాలుగు చేతులు. ఇంద్రనీలం వంటి వస్త్రం కలిగి యోగపట్టంతో ధ్యానముద్రలో ఉంటాడు. చేతుల్లో

1. చెరుకుగడ  2. యోగదండం
3. అక్షమాల  4. పాశం  ఉంటవి.

## 31. దుర్గాగణపతి :-

పుటం పెట్టిన బంగారు రంగుతో అష్టభుజుడై ఎర్రని వస్త్రాలు ధరించి ఉంటాడు. చేతులో

1. అంకుశం  2. పాశం
3. బాణం  4. విల్లు
5. జపమాల  6. తీగ
7. దంతం  8. నేరెడు పండు  ఉంటవి.

కాశీలోని ప్రధమావరణంలో ఈ గణపతి ఉన్నాడు.

## 32. సంకటహరణ గణపతి :-

లేతసూర్యుని వంటి రంగు, నాలుగు చేతులు, నల్లని వస్త్రాలు కలిగి ఎర్ర తామర పూవులో కూర్చొని ఉంటాడు. ఎడమ తొడపై బాలాదేవిపై ఉంటుంది. ఆమె పచ్చని శరీరకాంతి గలిగి నల్లకలువ పూవు ధరించి ఉంటుంది. చేతుల్లో

1. పాశం  2. అంకుశం
3. పానపాత్ర  4. వరదముద్ర కలిగి ఉంటాడు.

# మహారాష్ట్రలోని గణపతి ఆలయాలు

షణ్మతాలలో గాణాపత్యం కూడ ఒకటి. గాణాపత్యులు మహారాష్ట్రపలో ఎక్కువ. అందుచేత అక్కడ గణపతి ఆలయాలు ఎక్కువగా వెలసినవి. వానిలో ఎనిమిది ప్రసిద్ధంగా ఉన్నవి. వాని వివరాలు వినండి.

## 1. విఘ్నేశ్వరాలయం :-

ఇది బొంబాయి సమీపంలోని "ఓఝార్"లో ఉంది. దీన్ని అభినందన మహారాజు యజ్ఞస్థానమని చెబుతారు. వినాయకుడిక్కడనే విఘ్నాసురుని ఓడించినాడట.

## 2. మహాగణపతి ఆలయం :-

ఈ ఆలయం పూనా సమీపంలోని నిరంజన్‌గావులో ఉంది. ఈ గణపతి పది తొండాలతో ఇరువది చేతులతో ఉన్నాడు. కత్స్నమదుడనే రాజకుమారుడు ఈ గణపతిని ప్రార్థించి త్రిపురాసురుడనే రాక్షసుని జయించినట్లు పురాణగాధ.

## 3. గిరిజాత్మ గణపతి ఆలయం :-



ఈ ఆలయం దుర్గమారణ్యంలో బొంబాయికి 250 కిలోమీటర్ల దూరంలో ఉంది. సుమారు 2700 అడుగుల వైశాల్యంగల ఈ ఆలయంలో ఒక స్తంభం కూడా లేదు. ఇదొక వింత పార్వతికి వినాయకుడక్కడనే జన్మించినట్లు స్థలపురాణగాధ.



## 4. వరవినాయకాలయం :-



ఇది పూనా దగ్గర మహడ్‌లో ఉంది. విదర్భ మహారాజుకు ఈ వినాయకుని వరంతో పుట్టిన రుక్మాంగదడు ఒకపుడు వేటకు వెళ్లగా ముకుంద అనే ఒక ముని పత్ని అతనిని కామించి తన కోరిక తీర్చనందుకు కుష్టురోగివి కమ్మని శపించింది. అపుడక్కడికి నారదుడు రాగా అతని సలహాతో కాదంబ సరస్సులో స్నానమాడి రోగవిముక్తుడైనాడు. ఈ లోపల అక్కడ రుక్మాంగదుని వేషంలో యింద్రుడు వచ్చి ముకుందతో రమించగా ఆమెకు కృత్స్న మదుడు పుట్టినాడు. అతడు పెరిగిన పిమ్మట తన జన్మకారణం తెలిసికుని ఈ వినాయకుని గురించి తపంచేసి అనేక వరాలు పొందినాడు కనుక ఇతడు వరవినాయకుడైనాడు.

## 5. మయూరేశ్వర వినాయకాలయం :-

. ఇది "కర్ణ" నదీతీరాన మోరేగాపూలో ఉంది. ఈ వినాయకుడు, మయూర వాహనుడు గండకీ నగరాన్ని పాలించే చక్రపాణి అనే మహారాజు ఒక ఋషియొక్క సలహాపై సూర్యోపాసనచేసి సింధుడనే రాకుమారుని పొందినాడు. వాడు పెరిగి బ్రహ్మ విష్ణువులను గెలిచి శివుని పైకి రాగా వినాయకుడపుడు మయూర వాహనుడై ఇతనిని గెలిచినాడు.

## 6. చింతామణి వినాయకాలయం :-

ఈ ఆలయం కదంబతీర్థంలో ఉంది. అభిజిత్తు అనే మహారాజు కొడుకు గణుడు ఒక పర్యాయం కపిల మహాముని ఆశ్రమానికి వెళ్లి ఆయన దగ్గర చింతామణి అనే రత్నాన్ని చూచి దాన్ని తనకిమ్మని కోరి అతడీయకపోగా లాగుకొని వెళ్లగా కపిలుడు వినాయకుని ప్రార్థించినాడు. అపుడు వినాయకుడు గణుని సంహరించి ఆ చింతామణిని కొనివచ్చి మహర్షికిచ్చి అతని ప్రార్థనపై అక్కడ వెలిసినాడు. మంగోలియాలో చింతామణి గణపతి ఉన్నాడు. అతడు చతుర్భుజుడు - పరశువు - మూలకాండం, లడ్డు. త్రిశూలం ధరించి మూషకవాహనుడై ఉన్నాడు. ఆ మూషకం చింతామణిని నోటకరుచుకుని ఉంది.

## 7. భల్లాలేశ్వర వినాయకాలయం :-

ఇది కార్జాత్‌కు దగ్గరగల పాలీలో ఉంది. అక్కడగల ఢుంఠి వినాయకాలయం గూడ ప్రసిద్ధం. పూర్వకల్యాణుడనే వర్తకునికి బల్లాలుడనే కుమారుడున్నాడు. వాడు దినదినం వినాయకుని భజనచేస్తు గ్రామంలోని పిల్లలందరిని వెంటేసుకుని తిరుగుతుండగా ఆ తల్లి దండ్రి కల్యాణునితో చెప్పుకున్నారు. అతడు కుమారుని చేష్టలకు విసిగి ఒకనాడు అతనిని అడవికి తీసుకొనివెళ్లి ఒక చెట్టుకు కట్టివేసి బాగా కొట్టి వెళ్లినాడు. అపుడా బాలుడు వినాయకుని ప్రార్థించగా అతడు బ్రాహ్మణ వేషంలో వచ్చి అతని కట్లు విప్పి గాయాలు బాగుచేసి అతనిపేర అక్కడ వెలసినాడు.

## 8. సిద్ధి వినాయకాలయం :-

ఇది భీమానది పరివాహ ప్రాంతమైన "సిద్ధటేక్"లో ఉంది. విష్ణువు మధుకైటభులను వధించే అపుడు వారితో యుద్ధానికి శక్తిచాలక ఈ వినాయకుని ప్రార్థించగా అతడు విష్ణువునకు వారిని జయించే సిద్ధులిచ్చినాడు.

శివాలయంలో సాధారణంగా కుడివైపు వినాయకుడు ఎడమవైపు కుమారస్వామి ఉంటారు. ఈ వినాయకునికి సిద్ధి వినాయకుడని వ్యవహారం. భక్తులు ఈ వినాయకుని దర్శించుకొనే శివదర్శనానికి వెళ్లవలె. లేకుంటె స్వామి అతని కోరికను సిద్ధింపచేయుడు. కనుక అట్లా అతనిని దర్శించి లోపలికి వెళ్ళి వచ్చే అపుడు ఎడమవైపునుండి వస్తాడు కాబట్టి అక్కడ ఉన్న కుమారస్వామి చేతిలో

ఉన్న ఆయుధానికి శక్తి అనిపేరు. దాన్నిబట్టి స్వామి దర్శనం చేసికొని వచ్చేవాడు. ఆ విధ:గా శక్తిని పొంది వస్తాడని తాత్పర్యం.

# కొన్ని వినాయకీమూర్తులు

మనదేశంలో 5వ శతాబ్దం నుండి గణపతి పూజ విస్తరించింది. అది క్రమంగా తాంత్రికంలోగూడ చోటుచేసికున్నది. తాంత్రిక విధానంలో దేవీ ప్రాధాన్యత ఎక్కువ కనుక వారు వినాయకుని స్త్రీరూపంలో గూడ ఆరాధించినారు.

వినాయకుని పదహారు రూపాలలో స్త్రీమూర్తి కూడ ఒకటి. జైనులీమూర్తిని గణేశ్వరి - వైనాయకి అని బౌద్ధులు గణపతి హృదయ అని పిలిచినారు. గణేశాని మూర్తులు ఉత్తర భారతంలో కంటె దక్షిణభారతంలోనే ఎక్కువ.

## 1. గణేశాని -

ఈ మూర్తి శచీంద్రంలో ఉంది - ఇది చతుర్భుజి

## 2. వ్యాఘ్రపాని -

ఈ మూర్తుఉ చిదంబరం మరియు పళనిక్షేత్రాలలో ఉన్నవి. ఇవి అర్ధభాగం స్త్రీమూర్తి, అర్ధభాగం వ్యాఘ్రరూపంగా ఉన్నవి. బహుశః వ్యాఘ్ర పాదమూర్తికి స్త్రీ రూపాలు కావచ్చు.

## 3. గజవాహని -

ఈమె ఏనుగునెక్కి కుడిచేత ఒక పండు ఎడమచేత వజ్రం ధరించి ఉంటుంది. క్రీ. శ. 9వ శతాబ్దంలో ఉత్తరప్రదేశ్‌లో ఇట్టిదొక మూర్తి లభించింది.

## 4. మూషకవాహని -

ఈమె మూషకవాహనంపై జటామకుటధారియై ఉంటుంది. క్రీ.శ. 10వ శతాబ్దంలో మధ్యప్రదేశ్‌లోని త్రికంఘర్‌లో ఇట్టి మూర్తి లభించింది.

## 5. లంబోదరి -

ఈ మూర్తి గ్వాలియర్ మ్యూజియంలో ఉంది. ఈమె చతుర్భుజి. జటామకుటధారి. త్రైతేమహారశోభిత త్రిభంగిలో నిలచి చేతులలో పరశువు, ముకుళం, మోదకం, పాత్ర ధరించి ఉంది.

6. బ్రాహ్మీగణేశాని -

ఈ మూర్తి కలకత్తా మ్యూజియంలో ఉంది. ఈమె పద్మంపై పద్మాసనాసనయై ఉంది. ఈ దేవి యజ్ఞోపవీత ధారిణి.

# ఆదిగణపతి

చం॥ "తను వసి తాంబుదంబు, సితదంతయుగంబు చిరాంశులాత్మగ
ర్జన మురుగర్జనంబుగ రసస్రుతి శక్ర శరాసనంబునై
చన మదవారిదృష్టి హితసస్య సమృద్ధిగ సప్రవేశనా
జనుగణనాథుడిచ్చు ననిశంబు నభీష్టఫలంబు మాకిలన్"

**"కుమార సంభవము"** **"నన్నెచోడుడు"**

ఈ పద్యంలో వినాయకుడు ఘనా ఘనుగా చెప్పబడినాడు. గణ్యంతే బుధ్యంతే తేగణాః అనే వ్యుత్పత్తి ననుసరించి ఈ దృశ్యమానమైన జగత్తంతా గణమనబడుతుంది. కనుక దాని కధిష్ఠానమైన పరబ్రహ్మ తత్త్వమే సగుణ రూపంలో గణనాథుడయింది. ఈ పద్యంలో వర్ణింపబడిన గణపతి ద్విరదవదనుడు, అనగా (దంతయుగ్మం) రెండుకోరలుగలవాడు. ఇప్పుడు మనం పూజించే గణపతి ఏకదంతుడు. పరశురాముని చేత అతడు ఏకదంతుడైనట్లు బ్రహ్మాండపురాణం చెబుతుంది. కనుక అంతకు మొదట గణపతి రెండు దంతాలు గలవాడె.

ఐదుతలలున్న బ్రహ్మను తెల్లని కంఠమున్న శివుని శరీరంలో ఉన్న మన్మథుని రెండు దంతాలున్న గణపతిని బ్రహ్మసృష్టితో జాంబవంతుడు మాత్రమే చూచినాడట.

ఆంధ్రప్రబంధ కవులలో నన్నెచోడుడు ప్రథమ ప్రబంధకవిగా భావింపబడుతున్నాడు. కాబట్టి తదనుగుణంగా అతడు ఆదిగణపతిని స్తుతించటం తాను మొదట కవినని చెప్పకుండానే చెప్పినట్లయింది.

ఈ పద్యంలో గణపతి వర్షాకాల మేఘంతో పోల్చబడినాడు. లౌకిక వత్సరం మనకు వర్షర్తువుతోనే ప్రారంభమవుతుంది. శ్రావణ భాద్రపదాలు మనకు వర్షర్తువు కనుక వినాయకచతుర్థి వర్షాకాలంలోనే వస్తుంది. నన్నెచోడుడు గణపతిని ఆవర్షాకాల మేఘంతో పోల్చటం ఎంతో సముచితం. ఆనాడు సూర్యుని వెంట వినాయక నక్షత్ర సముదాయం. చంద్రునివెంట హస్తానక్షత్ర సముదాయం ఉంటవి.

రైతులకు ఏ పంటైనా మేఘుడు కరుణించి నాలుగు చినుకులు రాల్చితేనే గింజలు రాల్చుతుంది. లేకుంటే లేదు. అలాగే ఆస్తిక లోకానికంతా వినాయకుడనుగ్రహిస్తేనే వారివారికి

కార్యఫలం దక్కుతుంది. లేకుంటే రావణుడు తీసికు వెళ్లుతున్న ఆత్మలింగం లాగ దారినడుమనే పాతుకొని నిలిచిపోతుంది. ఇక పద్యతాత్పర్యం వినండి.

వినాయకునికి కృతయుగంలో తెలుపు, త్రేతాయుగంలో పసుపు, ద్వాపరంలో నలుపు, కలియుగంలో ఎరుపు రంగులు చెప్పబడినవి. ఈ పద్యంలో అతడు వర్షాభ్రంతో పోల్చబడినాడు. కాబట్టే నల్లరంగు చెప్పబడింది.

వైద్యశాస్త్రంలో పారదంశివవీర్యంగా గంధకం పార్వతి రజస్సుగా చెప్పబడుతుంది. ఆ రెండు కలిపినపుడు నలుపు వర్ణమే ఏర్పడుతుంది. కాబట్టి వినాయకుడు నలుపే అని కొందరి మతం.

నల్లని శరీరం కారుమబ్బు, తెల్లని దంతాలు దానిలోని మెరుపులు శరీరానికి అలంకారంగా అలదుకున్న గంధం, కుంకుమ హరిద్రాది రసాలు, ఇంద్రచాపం, తన గర్జనలు ఉరుములు, మదజలం కోరికలనే పంటలు పండే వర్షంగా వర్షాకాల మేఘంవలె కనిపిస్తున్న గణపతి ఎల్లపుడు మీకు కోరిన కోరిక లిచ్చుగాక !

మ॥ "కమలాక్ష స్మరఘస్మరాబ్జ భవులుంగ్రైవారు లంబోధిపూ
రములుంబక్కిట సాము గోత్రగిరివర్గంబున్ గనత్కందుకే
భము సంక్రోడన వేళనే విభున కాభవ్యుండు ప్రత్యూహసం
తమ సాదిత్యుడి భాననుండొసగు భద్రంబున్ కృతి స్వామికిన్

**"హరివంశము"** **"ఎఱ్ఱన"**

ఏ విభునికి ఆనందంలో క్రీడించే అపుడు, విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మక్రైవారం చేస్తుంటారో సముద్ర జలాలు అతనికి పుక్కిటిలోని నీరుగా, కుల పర్వతాలు ఆట బంతులుగా అవుతూ ఉంటాయో అటువంటి గొప్పవాడు. ఆటంకాలనే చీకట్లను తొలగించే సూర్యుడు అయిన గణపతి ఈకృతిని పఠించే వారికి శుభాలిచ్చుగాక !

ఈ పద్యంలో నుతింబడినవాడు ఇభాననుడు. ఇభం అనగా మదాన్ని పొందేదని అర్థం. కనుక కవిగారీ స్తుతికి మత్తేభాన్ని ఎత్తుకున్నాడు. ఈ కవి ఎఱ్ఱనగారు కనుక ఎఱ్ఱన అనగా అరుణుడు అనగా సూర్యుడు కాబట్టి గణపతిని "ప్రత్యూహ సంతమ సాదిత్యుడు" అని సూర్యునితో నిరూపించినాడు.

ఇందులో గణపతియొక్క విలాసక్రీడ అద్భుత రసావహంగా వర్ణింపబడింది. ఏనుగులు సాధారణంగా మదించినపుడే విజృంభించి అద్భుత రీతిలో ఎక్కువగా క్రీడిస్తుంటవి. ఇందులో నుతింపబడినవాడు "ఇభాననుడు" అనగా మదించిన ఏనుగు తలగలవాడు కనుక ఎఱ్ఱనగారీ పద్యంలో గణపతియొక్క క్రీడను చెప్పినాడు.

ఎర్రనగారిందులో వినాయకుని విభుడు అని విశేషించినాడు. విభుడనగా వివిధ రూపాలుగా విస్తరించేవాడు తన నాశ్రయించిన వారిని విశిష్టులనుగా చేయగలిగిన వాడని వ్యుత్పత్తి.

ఈ పదానికి నిఘంటువులు బలవంతుడు, ఘనుడు శ్రేష్ఠుడు, ఉత్తముడు, సమర్థుడు, సిద్ధుడు, జితేంద్రియుడు, దృఢమైనవాడు, ప్రభువు, పాలకుడు, యజమాని, చక్రవర్తి రాజాధిరాజు, సర్వవ్యాపకుడు, ఆద్యంతరహితుడు, శాశ్వతుడు, సర్వమూర్తి ద్రవ్యసంయోగి - అని ఈ విధంగా 17 అర్థాలనిచ్చినవి. నిఘంటువులు చెప్పిన పై లక్షణాలన్ని గణపతిలో పొజ్జ నిండా ఉన్నవి కనుక ఆ స్వామి ఈకృతిపతులకు భద్రం అనగా శుభం శ్రేష్టత్వం, జాగరూకతతోపాటు సువర్ణ పుష్పాలుగూడ దయచేయుగాక.

ఉ॥ ఖండశశాంక శేఖరుడు కన్నకుమారుని కగ్రజుండు మా
ర్తాండ శశాంక వహ్ని ముదిత ప్రభనొప్పెడి దివ్యమూర్తి యా
ఖండల పద్మజాచ్యుతుల ఖండిత భక్తి భజించు చుండువే
దండముఖుండ భీష్టఫలదాయకుడై బసవేంద్రు బ్రోవుతన్

**"పంచతంత్రము"** **దూబగుంట నారాయణ కవి**

ఈ పద్యంలో గణపతి వేదండముఖుడుగా చెప్పబడినాడు. వేదాః అండం జననకారణంయః సః వేదండః, యస్యనిశ్వసితంవేదాః అనే పురాణోక్తి ప్రకారం వేదాలు విరాట్పురుషుని నిశ్వాసనుండి పుట్టినవి కాబట్టి వేదండ ముఖుడనగా ఆ పరబ్రహ్మమే అతడే కారణదేహుడైన శివపార్వతులకు కుమారుడై పుట్టినాడు.

గణపతి కుమారస్వామి ఈ యిద్దరు శివపార్వతుల కుమారులే కాని వీరిలో ఎవరు కూడా పార్వతి గర్భవాసంనుండి జనించినవారుగారు. కొన్ని పురాణాల ప్రకారం ఒకందుకు గణపతియే వారికి సద్యోగర్భంలో జనించినట్లుగా ఉందికావి కుమారస్వామి జన్మం మిక్కిలి విచిత్రం.

అగ్నిదేవుడు శివపార్వతుల క్రీడను భంగంచేయగా అపుడు శివుని వీర్యం భూపతనమవుతుంది. పార్వతి కోపించి అగ్నిని ఆశివవీర్యం భరించమని శపించగా అతడు దాన్ని భరించలేక గంగకు అప్పజెప్పగా ఆమెగూడ దాన్ని భరించలేక తనలో స్నానమాడటానికి వచ్చిన ఋషిపత్నుల గర్భంలో నిక్షేపించింది. అంతవారు స్నానానంతరం తమకు గర్భాలు కలిగినందుకు విస్మయపడి వానిని వెలుపలికి తీసి అక్కడ ఒక రెల్లుగంటలో ఉంచగా చివరకు దానినుండి కుమారస్వామి జన్మించినాడు.

పార్వతీదేవి నలుగుపిండితో బొమ్మనుచేసి ప్రాణం పోసిందన్నా లేదా అనందకాననంలో ఆ దంపతులు గజరూపాలు ధరించి క్రీడించినారన్నా ఈ సంఘటనంతా కుమారస్వామి జననానికంటె ముదలే జరిగింది. కాబట్టి గణపతి కుమారాగ్రజుడైనాడు.

అతడు సూర్యచంద్రాగ్నుల తేజం కలవాడు. సూర్యుడు శివరూపం. చంద్రుడు దేవీరూపం. అగ్ని ఆ ఉభయుల రూపం. అందుచేతనే అతడు సూర్యచంద్రాగ్నుల తేజం గలవాడు. మరియు వేదండ ముఖుడు.

వేదండ శబ్దం శకంధ్వాదిగణంలో చేరింది. వేదః (సామవేదః) ఆడః జననకారణం యస్యసః వేదండః అని శబ్దానికి వ్యుత్పత్తి. పూర్వం మతంగ మహాముని ఒక పర్యాయం శివుని యెదుట సామవేదం చదువుతూ ఉండగా అపుడా స్వరంనుండి ఒక జంతు వుద్భవించెనట. సామవేధంనుండి పుట్టటంచేత దాన్ని అపుడు సామజం అని సామవేదం వేదాలలో ఒకటి కావటం చేత ఆ జంతువును వేదండం అని పిలిచినారు.

ఈ పురాణం వెనుక ఏనుగ కూడా పశుజాతిలోనే ఒకటి. పశువులు సంగీతానికి వశపడుతూ వుంటవి. కాబట్టి పురాణయుగంనాడు సామవేదం గానం చేస్తుండగా ఆ గానమాధుర్యానికి అడవిలో ఎక్కడో ఉన్నవి అపుడక్కడికి వచ్చి మతంగునికి వశపడిన జాతి అనవచ్చు. ఇట్లా ఒకానొక చరిత్ర గూడ ఇందులో ఉంది.

అటువంటి వేదండముఖుడైన గణపతి కోరిన కోరికలు తీర్చుతూ ఈ పాఠకులను రక్షించుచుండుగాక !

ఉ॥ బొజ్జగలయ్య యుంద్రముల భోగిమెరుంగు పసిండి చాయ బ
ల్గుజ్జు సమస్త యత్నములకుం జాలిపూజలు గాంచు మేటి యీ
ముజ్జగ మేలు ప్రాతదొర ముద్దుల పట్టిగణాధినాథ డు
ద్యజ్జయ మిచ్చురామ సచివాగ్రణి సోమన మంత్రి మౌళికిన్

**"సుదక్షిణా పరిణయము"** **తెనాలి అన్నయ**

ఈ పద్యంలోని వినాయకుడు గణపతిగా చెప్పబడినాడు. గణపతి అనగా దేవగణాలకంతా అధిపతి..

స్వర్గమర్త్య పాతాళాలనే మూడు లోకాలను పాలించే మొదటి దేవుడైన శివునియొక్క ముద్దుల కొడుకు, బంగారు రంగు వాడు మిక్కిలి పొట్టివాడు, సమస్త కార్యాలకు మొదట పూజింపబడేవాడు అయిన గణపతి (ఈ పాఠకులకు) సమస్తమైన పూనికలకు, అనగా పనులకు లేదా ఉద్యమాలకు జయం యిచ్చుగాక !

ఇతడు కొన్ని పురాణాలలో పార్వతీ పరమేశ్వరుల కుమారుడు. వైద్యశాస్త్రంలో పాదరమే మూలద్రవ్యం కనుక ఈ పద్యంలో శివుని కుమారుడైన యితనిని కవి బంగారు వన్నెగలవాడుగ చెప్పటం ఎంతో సమంజసం.

విష్ణువు పుండరీకాక్షుడు అనగా తెల్లతామర రేకులవంటి కన్నులు గలవాడు, శివుడు ధూర్జటి అనగా పెద్దపెద్ద జడలుకలవాడు. బ్రహ్మ చతురాననుడు, అనగా నాలుగు తలలు గలవాడు.

ఈ విధంగా దేవతలలో ఒక్కొక్కరికి ఒక ప్రత్యేకత ఉంది. అదే విధంగా వినాయకునికి లంబోదరం అనగా పెద్దగా ఉండి వ్రేలాడుతూ ఉండే బొజ్జ ఒక ప్రత్యేకత.

గణపతి సృష్టికంతా ఆదిపురుషుడు. ఈ సమస్త విశ్వం అతని ఉదరంనుండే పుట్టింది. కాబట్టి అతనికి లంబోదరుడనే వ్యవహారం ఉంది. ఆయనకు కుడుములంటే మహా యిష్టం. కుడుములు తినేవారు ఎలాగైనా బొజ్జగలవారే అవుతుంటారు. వానికి సంస్కృతంలో "మోదకాలు" అనిపేరు. అంటే తినేవారికి ముదం ఆనందం కలిగించేవి అని అర్థం. ఎల్లప్పుడు సంతోషంగా అనగా నిత్యతుష్టితో ఉండేవారు గూడ శారీరకంగా బాగానే ఉంటారు. కాబట్టి ప్రసన్నవదనుడైన గణపతికి లంబోదరత్వం ఆ విధంగా కూడా సమర్థనీయమే అవుతుంది.

శా॥ శ్రీవాణీ రమణాదు లెవ్వని జయశ్రీకాములై కొల్తురే
దేవున్ ప్రాజదువుల్ గజాననునిగా దెల్పున్ జగత్కర్తగా
నా విద్యా గరునిన్ గణేశ్వరుని భక్తాభీష్ట సంధాయకున్
సేవింతున్ మదిలో వినాయకుని సుక్షేమార్థ సంఇసద్ధికిన్

***"సుభాషిత త్రిశతి"*** ***పనుగు లక్ష్మణకవి***

ఈ పద్యంలో వినాయకుడు జగత్కర్తగా, విద్యారువుగా, త్రిమూర్తుల కారాధ్య దైవమైనవాడుగా చెప్పబడినాడు. వినాయకుడు గజముఖుడుగా పురాణాలలో ప్రసిద్ధుడు.

గజశబ్దానికి "సమాధినాయోగినోయత్ర గచ్ఛంతి ఇతిగః" సమాధి యోగంలో యోగులు ఎవనిలోనికి వెళ్లుతారో వాడు "గ" అనబడుతాడు.

"యస్మాత్ బింబప్రతిబింబతయాప్రణవాత్మకం జగజ్జాయత ఇతిజః" ఎవనినుండి బింబంతో ప్రతిబింబంవలె ప్రణవాత్మకమైన జగత్తు పుడుతుందో వాడు "జ" అని చెప్పబడుతాడు. కనుక ఈ ప్రకారంగా గజశబ్దానికి "యతోవా ఇమాని భూతాని జాయంతే యేనజాతాని జీవంతి" ఎవని వలన ఈ ప్రాణులన్ని పుడుతున్నాయో ఎవనివల్ల ఆ పుట్టిన వన్ని జీవిస్తున్నాయో వాడు గజముఖుడు. అనగా పరబ్రహ్మమని తాత్పర్యం.

లౌకికార్థానుసారం గజ శబ్దానికి "గజతి మాద్యతేతి గజః" గజమనగా మదం కాబట్టి దాన్ని పొందేది అని అర్థం. నిష్కళంకం నిరాకారం, నిర్గుణం అయిన పరబ్రహ్మం మాయతో కూడినపుడే సృష్టికి సమర్థమౌతుంది కాబట్టి గజ శబ్దానికి మాయతోకూడిన పరబ్రహ్మమని తాత్పర్యం. దీనికనుగుణంగా తాత్వికులు గణపతిని కంఠాది మస్తక పర్యంతం నిరుపాధిక బ్రహ్మమని అధఃకాయం సోపాధిక బ్రహ్మమని అతని నరశరీరం సోపాధిక బ్రహ్మ స్వరూపమని శిరస్సు ప్రణవ స్వరూపమై నిరుపాధిక బ్రహ్మమని వ్యాఖ్యానిస్తారు.

ఇక అతని వక్రతుండం ప్రణవమైన ఓం కారానికి ఏకదంతం అఖండమైన జ్ఞానానికి త్రపీకలుగా చెప్పబడుతవి. కాబట్టి ఈ విధంగా అతడు జగత్కర్తగా విద్యాగురువుగా ఆరాధింపబడుతున్నాడు.

ఈ పద్యాన్ని రచించినవాడు ఏనుగు లక్ష్మణకవి. ఏనుగు తల మనకు తెలివిగల పెద్ద తలకాయకు గుర్తు. ఇక ఈ కవి కృతి సుభాషిత త్రిశతి అందుచేత వేదాలు గజానునిగా చెప్పే విద్యాగురువును సేవిస్తున్నానని ఎంతో ఔచిత్యవంతంగా చెప్పినాడు. త్రిమూర్తులే దేవుని తమతమ కార్యాలు జయప్రదం కావటానికి సేవిస్తుంటారో వేదాలు ఎవనిని గజముఖుడని చెబుతున్నవో జగత్కర్త విద్యాగురువు అంటున్నవో అటువంటి గణపతి భక్తులకు కోరికలన్ని సమకూర్చేవాడు అయిన వినాయకుని నేను క్షేమార్థ సంసిద్ధిని కోరి మనస్సులో ఎల్లపుడు తలుస్తుంటాను.

ఉ॥ బాలశశాంక శేఖరుని పట్టి గజాననుడవ్యయుండు భ
క్తాళిక భీప్సితంబులు సమంచితరీతి నొసంగు సత్కృపా
శాలి హిరణ్య గర్భముఖ సర్వసుపర్వ ఫలప్రదాతయౌ
వేలుపు మమ్ము నెమ్మి శుభవీక్షణ లీలల బ్రోచుగావుతన్

*"గణేశ్వర చరిత్రము"* *నండూరి బాపయ*

ఇందులో గణపతి అవ్యయుడు, అనగా నాశనంలేని పరబ్రహ్మ స్వరూపుడుగా చెప్పబడినాడు. ఆ పరబ్రహ్మమే సగుణంలో లీలార్థమై శివుని కుమారుడుగా గజాననుడై ప్రసిద్ధిని పొందినాడు. కనుక.

బాలచంద్రుని ధరించిన శివుని కుమారుడు ఏనుగుముఖం కలవాడు బ్రహ్మమొదలైన సమస్త దేవతలకు కోరిన ఫలాలనిచ్చేవాడు, భక్తులకు కోరిన కోరికలు తీర్చే దయామయుడు అయిన గణపతి మనల నెల్లప్పుడు ప్రేమతో తనయొక్క శుభదృష్టి విలాసాలలో రక్షించుచుండుగాక !

గణపతి గజముఖుడెట్లైనాడు -

పూర్వం శివపార్వతులు సంతానార్థమై విష్ణువును గురించి తపం చేయగా అతడు ప్రత్యక్షమై వారి కోరికను విని తానే సుందరమైన బాలకుడై వారి వడితో నిలిచినాడు. అపుడు పార్వతి ఆ బాకుని వడిలో ఉంచుకొని కూర్చోగా దేవతలందరు చూడవచ్చినారు. అందరితోపాటు శనైశ్చరుడు గూడ వచ్చినాడు. కాని అతడు తలవంచుకుని ఉన్నాడు.

పార్వతి అతనిని చూచి తల ఎందుకు వంచుకున్నావని అడిగింది. అతనికి ఎవరి ముఖం చూస్తే వారి తల పగులుగాక అని భార్య శాపం ఉంది.

శనైశ్చరుడు గొప్ప విష్ణుభక్తుడు. ఎపుడు ధ్యానంలోనే నిమగ్నుడై ఉండేవాడు. ఒకనాడతని భార్య జ్యేష్ఠాదేవి కామాసక్తురాలై నిండుగా అలంకరించుకొని అతని దగ్గరకు వచ్చింది. కాని అతడు

కన్నెత్తి చూడలేదు. ఆమెకు నిలిచి నిలిచి విసుగు వచ్చింది. అతడపుడు నీవు నాకు కనిపించకు పొమ్మని కసిరినాడు. దానితో ఆమె కోపించి నీవెవరి ముఖంచూస్తే వారి తల పగిలిపోవుగాక అని శపించి రుసరుసా అక్కడి నుండి వెళ్లిపోయింది. ఇల్లాలు తనను కోరివచ్చినపుడామెను పలుకరించకుండటం ధర్మం కాదుకదా !

శని తన శాపకారణం పార్వతికి విన్నవించినాడు. అది విని పార్వతి పర్వాలేదు నా కుమారునికేంగాదు. నీవు ఒకసారి తలెత్తిచూడు అని అన్నది. అది విని ఆయన కన్నులెత్తి ఆ బాలుని చూచినాడో లేదో అంతే అతని తల ముక్కలై ఎగిరిపోయింది. అంత అది చూచి శివుడు పార్వతి నూరడించేందుకై ఆ బాలుని బ్రతికించటానికి ప్రమథులను పిలిచి ఇప్పుడుత్తరం దిక్కుగా తలచేసి ఎవడు నిద్రిస్తుంటె వాని తలను తీసుకురండి అని పంపినాడు.

ఉత్తరం దిశగా తలపెట్టి ఎవరుగూడ నిద్రించరు. కనుక వారికి కైలాసంలో ఎవరూ కనిపించకపోగా దాని ప్రక్కనగల పుష్పభద్రానదీతీరానికి వచ్చినారు. అక్కడ ఇంద్రుని ఐరావతం ఒకపెంటితో జతకట్టగా దానికి ఒక దూడ కలిగింది. అది చూడముచ్చటగా ఉండి ఉత్తరంవైపు తలపెట్టి నిద్రిస్తున్నది.

ఇంద్రుడప్పుడక్కడికి రంభకోసం ఒక పొందరింటికి వస్తుండగా దారిలో దుర్వాసుడెదురుపడి ఒక పారిజాతసుమాన్నిచ్చినాడు. అతడు దాన్ని పట్టుకొని అలాగే రంభదగ్గరకు వచ్చి ఆ సంతోషంతో చేతిలోని పుష్పాన్ని పాద వెలుపలికి విసరగా అది వచ్చి నేరుగా ఈ నిద్రిస్తున్న ఏనుగుపిల్ల తలపై పడింది. ప్రమథులది చూచి దాన్ని ఒక శుభసూచకంగా భావించి ఆ ఏనుగుపిల్ల తలను ఖండించుకొని తీసికొని వెళ్లగా శివుడాతలనే "గణపతి" కబంధానికతికించి పునర్జీవితుని చేసినాడట. ఇది మనకు గజముఖుని గురించి పురాణాలు చెప్పే వృత్తాంతం.

మ॥ హరియైనన్ హరుడైన వారిజభవుండైనస్ పులోమాత్మజా
వరుడైనన్ పనిబూని తొల్త నినుగొల్వస్ గొప్పయేమాదృశుల్
వరభక్తిన్ నినుగొల్వ కుందురె శుభ ప్రారంభవేళస్ ద్విపే
శ్వరవక్త్రా చనబన్నముల్ విమలవాచాశుద్ధి మాకూన్చుమా

**"విక్రమాంక దేవచరిత్రము"** ***ఆంధ్రబల్హణ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి***

ఈ పద్యంలో గణపతి ద్విపేశ్వర వక్త్రుడుగా చెప్పబడినాడు. "ద్వాభ్యాం పిబతీతి ద్విపః" అని ద్విప శబ్దానికి వ్యుత్పత్తి ఏనుగు తొండంతో నీటిని పీల్చుకొని నోటిలో పోసుకుంటుంది. ఈ విధంగా అది రెండింటితో నీరు తాగుతుంది. కాబట్టి ద్విపం అనగా రెంట త్రాగుడు అయింది.

ఓ గణపతీ ! విష్ణువైనా శివుడైనా బ్రహ్మయైనా ఇంద్రుడైనా ఏ కార్యం ప్రారంభించినా మొదట పనిగట్టుకొని నిన్నే పూజిస్తారు. అంటె మావంటివారు ఒక మంచిపని ప్రారంభించినపుడు నిన్ను

పూజించకుండా ఉంటారా ? ఓ స్వామీ! ఆటంకాలు తొలగే అట్లా మాకు శ్రేష్ఠమైన వాక్శుద్ధి కలిగించు అనగా మా నోటివెంట అపశబ్దాలు అశ్లీలాలు దొరలించుకు అని తాత్పర్యం.

ఇంద్రియ సంయమనాలన్నిటిలో వాక్సంయమనం అన్నిటికంటె గొప్పది. మితంగా మాటాడ్డం, హితంగా మాటాడటం అపశబ్దం పలుకకుండా అశ్లీలం ఉచ్చరించకుండా ఉండటం ఒక తపస్సు.

ఆంధ్రబిల్హణుని భావాన్ని పలికిన మరో కవిని గూడ యిక్కడనే చిత్తగించండి.

ఉ॥ నిన్ను దలంత్రు మున్నుగ గణేశ దిగీశము ఖామరాళితా
మున్నుతి జేయబూను పనికొచ్చెడు విఘ్నము బాపగోరి, నే
నన్నునొయల్పుడన్ తవగుణావళి నెన్ననశక్తుడన్ కృపా
నన్నుత మత్కృతి న్నెరపు శాంకరి ముద్దుల పట్టి వేడెదన్

***"శ్రీ అనంతగిరి మహాత్మ్యము"*** ***కొండాపురం అనంతాచార్యులు***

ఉ॥ ఏనిక మోమువాడు కళలెల్ల వసించెడు మేలు బొజ్జవా
డానన మందు దంతమొక డందర విఘ్నభయంబుదీర్పగా
నేనెయటంచు తన్నె వచియించెడి నాతొలి పూజనెల్లడన్
తానెగ్రహించు వేల్పడచుతన్ భువి మత్ప్రబలాంతరాయముల్

***"హర్షప్రబంధము"*** ***పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు***

ఈ పద్యంలో వినాయకుడు ఏకదంతుడుగా నుతింపబడినాడు. ఆ ఏకదంతం మీ అందరి విఘ్న భయాలు తీర్చే అందుకు నేనే సుమా అని సగర్వంగా చెబుతున్నదట. ఈ కవి పూర్ణ ప్రజ్ఞుడు గదా! వినాయకుని దంతశబ్దం జ్ఞానం అనే అర్థంలోగూడ వర్తిస్తుంది కాబట్టి ఈ ఏకదంతం దాన్నే వ్యంజస్తుంది. కాబట్టి పద్యంలో దానికి ప్రాధాన్యత వివక్షించి నాడు. అంతేగాదు అతడు స్థూలోదరుడుగూడ దేవతలలో అంతపాటి బొజ్జ మరెవరికీ లేదు.

వినాయకునికి అంతలావు బొజ్జ ఎందుకు అతడు విద్యాగురువు కాబట్టి పద్నాలుగు విద్యలు అరవై నాలుగు కళలు అన్ని అందులోనే ఉన్నవి మరి.

అందుచేత ఏనుగుతలవాడు, ఏకదంతం గలవాడు, పొట్టివానికి పుట్టెడు బుద్ధులు గనుక పొట్టనిండ పుట్టెడు విద్యలు గలవాడు. అన్ని కార్యాలలోను ప్రథమ పూజలందుకునేవాడు అయిన దేవుడు మనయొక్క ప్రబలమైన ఆటంకాలన్ని తొలగించుగాక !

మ॥ సకలోద్యోగములున్ ఫలింప మునుపే సౌజన్య వారాసి. ది
వ్యకృపా సారము మూలమౌనొ దివిజవ్రాతంబు సేవించు వా
రికి మున్నేఘను సేవ ముఖ్యమగునో ప్రీతిన్ విచారించి సృ
ష్టికి నాద్యుండగు విఘ్నదేవు గొలుతున్ శ్రేయోర్థినై నిష్టులన్

***"శ్రీమదాంధ్రాభ్యుదయము"*** ***భూతపురి సుబ్రహ్మణ్యశర్మ***

ఈ పద్యంలో గూడ గణపతి సృష్టికి మూలభైవంగానే చెప్పబడినాడు. అంతేగాక అతడు విఘ్నదేవుడు విఘ్నాంతకుడుగూడ.

వినాయకుడు తొలిపూజ దైవం కనుక ఎవరు ఏ దేవుని పూజించినా ఏ పని తలపెట్టినా మొదట గణపతి పూజ చేయవ తప్పదు. కనుక దేవతలనుగ్రహం పొందదలచిన వారికి మొదట పూజింపవలసిన వాడెవడో, మానవులు తలపెట్టే ఏ కార్యం ఫలించాలన్నా ఎవనియొక్క మంచితనంతోకూడిన అనుగ్రహం ముఖ్యమో బాగా ఆలోచించి నేను సృష్టికి మూలమైన అటువంటి విఘ్నదేవుని శ్రేయంకోరి సేవిస్తున్నాను.

వినాయకుడు విఘ్నదేవుడెట్లయినాడు ?

పూర్వం అభినందనుడనే ఒక ప్రభువున్నాడు. అతనొకప్పుడు దక్షుడు శివుని పిలువకుండా యాగం తలపెట్టగా తాను ఇంద్రుని పిలువకుండా ఒక యాగం తలపెట్టినాడు. అప్పుడదిచూచి ఇంద్రునికి కోపం కలిగి కాలపురుషుని పిలిచి అభినందనుని యాగానికి విఘ్నం కలిగించమని చెప్పగా అతడు విఘ్నాసురుడనే ఒక దైత్యుని సృజించి పంపినాడు.

వాడు అభినందనుని యజ్ఞం జరుగకుండా చేసి అప్పటినుండి యిక మహర్షులు చేసే యజ్ఞాలకు గూడ ఆటంకం కలిగించటం మొదలుపెట్టినాడు. అపుడు వారందరు వెళ్ళి బ్రహ్మతో మొరపెట్టుకోగా అయన దేవగణాలకంతా వినాయకుడధిపతి కాబట్టి మీరువెళ్ళి అతనిని శరణు వేడండి అని చెప్పినాడు.

అంత మహర్షులు వచ్చి గణపతిని శరణువేడగా అతడు విఘ్నాసురునిపైకి వెళ్లినాడు. విఘ్నాసురుడపుడు గణపతి బుద్ధి బలానికి ఓడిపోయి దాసోహం అని అతని వశవర్తి అయినాడు. కనుక ఇపుడెవరు గణపతిని మొదట పూజించరో వారి దగ్గరకు వినాయకుడతనిని అనగా అవిఘ్నాసురుని పంపుతూ ఉంటాడు.

ఉ॥ ఆదరమొప్ప దేవతల కందరకున్ భజనీయుడౌచు కా
ర్యాదినుతింప విఘ్నహతి నందగనీక కృతార్థు జేయుచున్
ప్రోది సమస్తలోకముల పోషకుడౌచు వెలుంగుచుండు న
య్యాది మహపూజ్యు విఘ్నపతి నాత్మభజించెద నిష్టసిద్ధికై

ఈ పద్యంలోని వినాయకుడు విఘ్నపతిగానే కాక లోకాలను పోషించే వాడుగా అనగా "శుక్లాం బరధరం విష్ణుం" అని విష్ణు స్వరూపునిగా గూడ తెలుపబడినాడు.

దేవత లందరిచేత ఆదరంగా పూజింపబడేవాడు, సమస్త లోకాలకు పోషకుడై ప్రకాశించేవాడు, ఎవరు ఏ కార్యం తలపెట్టినా మొదట తనను పూజించినపుడా పనికి ఏ ఆటంకం కలుగకుండా చూసేవాడు అయినటువంటి విఘ్నపతిని నేను కోరికలు తీరేందుకై ఆత్మలో ఎల్లప్పుడు తలుస్తుంటాను.

ఆస్తిక లోకంలో దైవాన్ని ఎపుడో ఒకపుడు తలువని వారెవరూ ఉండరు. కాని దైవాన్ని ఎపుడో ఒకపుడు గాదు ఎప్పుడూ తలవటం ముఖ్యం అదికూడ బయటికి నలుగురు చూడ తలిచే దానికంటే ఆత్మలో తలవటం ముఖ్యం ఆత్మలో ఆ భావన లేనపుడు బయటికి తలవటం చేపురికార్డు సమానమే అవుతుంది.

# బా(పా)ల గణపతి

మ॥ జననీ స్తన్యము గ్రోలుచున్ చరణ కంజాతంబునన్ కింకిణీ
స్వనమింపారగ తల్లిమేన మృదుల స్పర్శంబుగా దొండ మ
ల్లన యాడించుచు చొక్కు విఘ్నపతి యుల్లాసంబులో మంత్రి వె
న్ననికిన్ మన్నన సొంపు మీర నొసగున్ భద్రంబు లెల్లప్పుడున్

*"శృంగార శాకుంతలం"* **పిల్లలమర్రి పినవీరన**

తల్లిపాలు త్రాగుతున్నా పనివాళ్లు చేతులూరుకోవు - కాళ్లు తమకున్న కడియాలు గజ్జెలు గల్లుగల్లుమనే అట్లుగా నాట్యం చేస్తూ ఉంటె, చేతులు తల్లి శరీరాన్నిమృదువుగా స్పర్శిస్తూ మరోవైపు విన్యాసాలు చేస్తుంటవి. కనుక తల్లిపాలు త్రాగుతూ గజ్జెలు గల్లుగల్లుమని మ్రోగుతుండగా పాదాల నాడిస్తూ ఏనుగు తొండం ఎపుడూ ఊరుకోదు. ఏదో ఒకటి పుడుకుతూనే ఉంటుంది, కనుక ఏనుగు పిల్ల తల్లి శరీరంపై పాలు త్రాగేవేళ తన తొండాన్ని ఆడించినట్లు మృదువుగా గౌరి శరీరాన్ని లేత తొండంతో స్పృశిస్తూ పరవశించె బాలగణపతి ఎల్లపుడు పాఠకులకు దయతో శుభాలు యిచ్చుగాక!

వినాయకుని ఇంతవరకెందరో వర్ణించినారుగాని అతడు తల్లిపాలు త్రాగటానికి శ్రీకారం చుట్టినవాడు పిల్లలమర్రి పినవీరనగారె. ఈ తరువాత యితని యొక్క ఈ పద్యం ఎందరెందరి ఊహలకో భిక్ష పెట్టింది. జననీ అని ప్రారంభించిన వీరన ఈ పద్యంలో వినాయకుడామె తనయుడు అనగా కన్నకొడుకైనట్లుగానే సూచించినాడు.

ఉ॥ అంకము జేరిశైల తనయాస్తన దుగ్ధములానువేళ బా
ల్యాంకవిచేష్ట దొండమున నవ్వలి చన్గబళింపబోయి యా
వంకకుచంబు గానకహి వల్లభ హారముగాంచి వే మృణా
ళాంకుర శంకనంటెడు గజాస్యుని గొల్తున భీష్ట సిద్ధికై

**"మనుచరిత్ర"** **అల్లసాని పెద్దన**

పార్వతీదేవి ఒకనాడు కుమారుడైన గణపతిని తొడలపై పెట్టుకొని పాలిస్తున్నది. సాధారణంగా స్త్రీలు తమ పిల్లలకు మొదట ఎడమ రొమ్మును, ఆ తరువాత కుడి రొమ్మును యిస్తుంటారు. కనుక పార్వతికూడ అందుకు భిన్నంకాదు. అయితే ఆమె అర్ధాంగి అనగా శివుని అర్ధదేహం పాలుపంచుకున్నది ఆమె అర్ధాంగి అనగా శివుని అర్ధదేహం పాలుపంచుకున్నది కాబట్టి కుడివైపంతా పురుషదేహంగా ఉంటుంది. ఆవైపు సర్పభూషణాలేగాని చన్నుండదు.

గణపతి ఎడమవైపు చన్నుత్రాగి కుడివైపుదాన్ని అందుకోబోయినాడు. ఆవైపున చన్ను కనిపించలేదు. దాని బదులుగా సర్పభూషణం కనిపించింది. అది లేత తామర తూడువలె ఉన్నది. ఏనుగులకు తామరతూడులంటె చాలా యిష్టం. వినాయకుడు గజాస్యుడు గనుక గజబుద్ధితో ఓహో నాకు ఆటకు తామతూడు లభించెనని దాన్ని పట్టుకోబోయినాడు. అటువంటి గజముఖుని నేనుకోరికలు సిద్ధించే అందుకు సేవిస్తున్నాను.

ఈ పద్యంలో పార్వతి అర్ధనారీశ్వరిగా చూపబడింది. పార్వతి శివుని గూర్చి మొత్తం మూడు తడవలు తపం చేసింది. మొదటిసారి ఆమె అతనిని పతిగా పొందటానికి తపం చేసింది. అపుడామె పర్వత పుత్రిక. అంటె కొండజాతిది. కాబట్టి ముక్కుమొగం చక్కగా ఉన్నా రంగు నల్లగా ఉండేది. అందుచేత తల్లిదండ్రి ఆమెకు కాళి అని పేరుపెట్టినారు. అందుచేత ఆమె వివాహానంతరం స్ఫురద్రూపం కలుగటానికి రెండవసారి తపం చేసింది.

శివుడుకైలాసంలో ఎపుడైనా పార్వతితోనే కొలువుతీరేవాడు. కాని దేవతలుగాని ప్రమథులుగాని శివునికొక్కనికే ప్రదక్షిణంచేసి నమస్కరిస్తుండేవారు. అదిచూచి పార్వతి తనకు నమస్కరించకపోవటం ఒక కొరత అనిపించి భర్తను దేవతలు తనకెందుకు నమస్కరించరని అడిగింది. అపుడతడు దేవి నీతో ముక్తికోరేవారికే ప్రయోజనంలేదు గదా ! అన్నాడు. అపుడది విని పార్వతి ఆ పర్యాయం ఇంకా కఠినమైన తపం చేసింది. అపుడు శివుడామె తపానికి మెచ్చి తనయొక్క అర్ధదేహాన్ని ఆమెకిచ్చినాడు. ఆ విధంగా ఆమె అప్పటినుండి అర్ధాంగి అయింది.

శీ॥ శ్రీ గౌరీకుచ హైమకుంభ కలిత క్షీరంబులం గ్రోలిత
ద్భాగాసక్త నిజాన నంబపుడు తాభావించి ప్రత్యాపత

స్వాగ భ్రాంతిని దూటగా జనని తాన వ్యానురక్తిన్ నగన్
రాగానందము జెందు నగ్గణపతిన్ ప్రార్థింతు వాక్సిద్ధికిన్.

**"చంద్రికాపరిణయం"** **మాధవరాయలు**

ఈ పద్యంలోని బాలవినాయకుడు మంచి తుంటరి. పార్వతీదేవి రొమ్ములు పాలునించిన బంగారు కుండలవలె ఉండి మిసమిసలాడుతున్నవి. గణపతి ఆ కుండలోని పాలు బొజ్జనిండా త్రాగి అనంతరం ఆ రొమ్ములకేసి చూడగా వానిలో తననీడ కనిపించింది. పిల్లలకు అద్దంలో తన ప్రతిబింబం కనిపించినప్పుడు చేతులతో దాని కొండుతూ ఆడుకోవటం మనం చూస్తుంటాం. అలాగే అడవిలోని యూథపతులు అనగా ముందుముందు నడిచే మగ ఏనుగులు మరో యూథపతి కనిపించినప్పుడు అలవోకగానైనా దానితో ఒకసారి తలపడి తలతో కుమ్మటం చేస్తుంటవి కనుక ఇక్కడ వినాయకుడు గూడ అదే గజబుద్ధితో తల్లిరొమ్ములోని తన ప్రతిబింబాన్ని కుంభస్థలంతో ఒకసారి కుమ్మినాడు. అప్పుడా స్పర్శకు తల్లియైన పార్వతి అపూర్వమైన వాత్సల్యానురాగాన్ని పొందింది.

అట్లా ఆనందించిన తల్లి ముఖంచూచి తానుగూడ ఆరాగానందాన్ని పాలుపంచుకున్న బాలవినాయకుని నేను వాక్సిద్ధికై ప్రార్థిస్తున్నాను.

శివానియొక్క స్తనయుగం సంగీత సాహిత్యాలనే క్షీరం కలది. అని పురాణ ప్రసిద్ధి. కాబట్టి అటువంటి పాలను కడుపునిండా త్రాగిన వినాయకుని వాక్సిద్ధికై ప్రార్థించటం ఇందులో కవిగారి మెళకువకు నిదర్శనం.

చ॥ గిరిజయు రోజ దుగ్ధముల క్రేవల జారగ గ్రోలి బొజ్జపై
పరపలు బారు చారలహి పల్లభహారము బోదు కోడెలై
మెరయుంగ బాల లీలలకు మేలము లాడుచు ముద్దుజూపునా
కరిముఖు జూచినవ్వు శితికంఠుడు మా కొనగూర్చు సంపదల్।

***"ప్రబంధ రాజవేంకటేశ్వరవిలాసము"*** ***- గణపవరపు వేంకటకవి***

ఈ పద్యంలో బాలగణపతి వర్ణింపబడినాడు. ఈనాటి తల్లులకు పురిటిలోనే పాలు ఎండిపోతవి. కాని పూర్వం అట్లాకాదు. కొడుకులు మూడునాలుగు ఏండ్లు వచ్చేవరకు గూడ దూడలవలె పాలుకుడిపేవారు. ఆనాటి వారికి అసలు పుష్కలం దానిని పిల్లలు కుడిచినన్ని కుడిచి బొజ్జనిండిన తరువాత పుక్కిటబట్టి చిమ్ముతూ వెడలగాస్తు ఆనందించేవారు.

ఇక్కడ గణపతి అలాగే బొజ్జనిండా పాలుకుడువగా అనంతరం అవి వరదలై నోటి సెలవుల నుండి కారి బొజ్జపై తెల్లని చారలుగా పారినవి. అప్పుడా చారలతని బొజ్జపై పాప చేరు జతకు మరిన్ని తెల్లని పాప చేరులై కనిపిస్తుండగా అతడు తల్లిఒడిలో ముద్దుముద్దుగా ఆడుతున్నాడు.

అపుడా కుమారుని చూచి పుత్రానందంతో నవ్వుతూ ఉన్న తెల్లని కంఠంగల పరమశివుడు మనకు సంపదలిచ్చుగాక.

ఇందులో గూడ గణపతి కరిముఖుడుగా జన్మించినట్లే సూచించబడింది. అంతేగా దీనిలోని శివుడు శితికంఠుడు అనగా తెల్లని కంఠం గలవాడు.

ఇపుడు మనం ఏడవ మన్వంతరంలో ఉన్నాం. క్షీరసాగర మధనం ఆరవ మన్వంతరంలో జరిగింది. అపుడు సముద్రంలో హాలాహలం పుట్టగా దాని పానంచేసి శివుడు నీలగళుడైనాడు. కాని అంతవరకు ఆయన సితికంఠుడే.

శా॥ శ్రీ ద్రాక్షాయణి యంక పీఠమున కూర్మిన్ నిల్చి శుండాతత
త్స్వాదుస్తన్యము చాలగ్రోలి యవ శిష్టం బాశ్రితశ్రేణి కా
హ్లాదం బొప్ప నొసంగురీతి నుభయ ప్రాంతంబులం జిమ్ము న
వ్వేదండాస్యుడొనర్చు పూర్ణ కృప నిర్విఘ్నంబు నీ కావ్యమున్

**"నాగరఖండం"** **తురగా రామకవి**

పూర్వం తల్లులకు పాలు సమృద్ధి. పిల్లలెంతగా త్రాగినా చేపులారక వారు బలవంతంగా కొడుకులకు మరీమరీ చన్నుగుడిపేహరు. అపుడా పిల్లలు త్రాగినన్ని త్రాగి కడుపునిండిన తరవాత గారెలు చేదన్నట్లు వాటిని కుశాలుతో వెళ్లగాసేవారు లేదా పుక్కిటినిండా పట్టి తల్లి ముఖంపైకే పుక్కిలిస్తుండేవారు లేదా ప్రక్కలకు చిమ్మేవారు. కనుక ఈ పద్యంలోని గణపతిలో మనకటువంటి చిలిపి పిల్లవాడు కనిపిస్తాడు.

వినాయకుడు ప్రక్కలకు చిమ్ముతూ ఆశ్రితశ్రేణికి తల్లి చనుబాలు పంచుచున్నాడనగా దేవీస్తన్యం సంగీత సాహిత్యాలుగాబట్టి వినాయకుడు తననాశ్రయించిన వారికి వాఙ్మయ మూలమైన విద్యలన్ని యిచ్చేవాడని కవి యిందులో సూచించినాడు.

ఉ॥ బాగుగ తల్లిమేనిపయి ప్రాకి కుచోదిత పుణ్య దుగ్ధముల్
రాగముతోడ గ్రోలుచు సురప్రమదానికరంబు నవ్వుచున్
తీగకు కాయ వ్రేగెయని తీయముగా బలుకంజెలంగునా
నాగముఖుండనంత విభునందను గంగని ధన్యుజేయుతన్.

**"నాసికేతోపాఖ్యానం"** **దగ్గుపల్లి దుగ్గన**

వినాయకుడు స్థూలకాయుడు అందులో ఏనుగు తలకాయ. ఇక పార్వతి యేమో అపర్ణ నగా ఆకులుకూడ తిననని బలహీనురాలు.

ఏడు ఏణ్నర్థం పిల్లలు పాలుత్రాగే అపుడు నడుమ నడుమ చన్ను విడిచి తల్లి శరీరంపై ప్రాకుతుంటారుగూడ ఇక్కడ తుంటరి వినాయకుడదే పని చేస్తున్నాడు. వాడేమో బొద్దుగా గుమ్మడిపండులాగా ఉన్నాడు. పాపం పార్వతి అపర్ణ కాబట్టి బక్కగా తీగలాగా ఉంది. అందువల్ల ఆ తల్లి కొడుకులను చూచి దేవతా స్త్రీలు నవ్వుకుంటుండగా గౌరి మీరెందుకు నవ్వుతారమ్మా! ఎక్కడైనా తీగకు కాయ బరువా ? అని మధురంగా వారిని మందలిస్తుది. అట్లా వారిని మందలిస్తుండగా యింకా చెలరేగిపోతున్న ఆ బాలగణపతి ఈ పాఠకులను ధన్యులను జేయుగాక !

దుగ్గన దుర్గా శబ్ద వికృతి కాబట్టి ఈ పద్యంలో కవి దుర్గయైన పార్వతీదేవి హృదయాన్నావిష్కరించటం గమనింపవలసిన యంశం.

మ॥ జననీ స్తన్యము గ్రోలు ప్రాయముననుత్సాహంబుతో దేవతా
వనితల్ వేడుక బుట్ట తాళగతులన్ వాయించుం బాడగా
కనదుల్లాసము తోడ బొజ్జగదలంగా నాడు లంబోదరుం
డను రాగంబున రాఘవ ప్రభుని నిత్యశ్రీయుతున్ జేయుతన్

**"విష్ణుపురాణం"** **వెన్నెలకంటి సూరన**

ఈ పద్యంలో వినాయకుని బాల్య స్వభావం చక్కగా చూపబడింది. పాలుత్రాగే ప్రాయంలో ఉండి దేవతాస్త్రీలంతా ఆనందంగా చేతులతో తాళాలు వేస్తుండగా మహా సంతోషంతో బొజ్జ గదులగా నాట్యమాడుతున్న లంబోదరుడు అనురాగంచేత నిత్యం పాఠకుల నైశ్వర్య యుక్తులనుగా జేయుగాక !

శ్రీకృష్ణుడు గూడ బాల్యంలో ఇట్లాగే ఆడేవాడట.

పాదున్ మందునిభంగి - గోపవనితల్ పాణిధ్వనుల్నేయగా
నాడున్ జంత్రము కైవడిన్ పరవశుండై హస్తముల్ ద్రిప్పుతున్

అని పోతనగారు అతనిని వర్ణించినాడు.

చ॥ తనరగ గ్రుచ్చి యంబికముదంబున కౌగిలి జేర్చుచో ఘన
స్తనయుగ కుంభయుగ్మములు దార్కొని యొప్పునకై యసూయమై
జెనకి పెనంగ నొండొకట జేరి నలాగున నుల్లసిల్ల భెం
పెనసిన వానిప్రీతి నుతియించెద నేనిక మోము వేలుపున్

**"నృసింహపురాణం"** **ఎఱ్ఱన**

సాధారణంగా తల్లులు తమ కొడుకులను ఎత్తుకుని ఎవరు పాలిస్తున్నప్పుడు చిలిపి పిల్లలు కుశాలుతో ఆ తల్లుల రొమ్ములను తమ తలతో రాపిడిపెట్టి ఆనందిస్తుంటారు. తల్లియైన అంబిక సంతోషంతో కుమారుడైన గజాననుని ఎత్తుకొని ఎవరు పాల్తుకోగా స్త్రీలయొక్క స్తనయుగ్మం ఏనుగుల కుంభస్థలం వలె ఉంటుంది. కాబట్టి వినాయకుని కుంభయుగ్మం తల్లియొక్క స్తనయుగ్మంపై అసూయపడి దానిని ఎదుర్కొని పెనగినట్లు అతడు తల్లి రొమ్ములను తలతో రాపిడి పెట్టినాడు.

అపుడు గౌరియొక్క కుచయుగ్మం గుండ్రదనంతోను గట్టిదనంతోను వినాయకుని కుంభస్థలానికి ఏమాత్రం తీసిపోక ఆ రెండు ఒక్కటేయై ప్రకాశించినవి. అపుడంతవరకు తమ తల్లియొక్క స్తనయుగ్మం తన కుంభస్థలానికి సాటిగావనుకున్న బాలగణపతి సంతృప్తితోడి గర్వాన్ని పొందినాడు.

అటువంటి ఆ గణపతిని నేను నుతిస్తున్నాను.

ఉ॥ సిద్ధములైన భూషణమణి ప్రకర ద్యుతులన్ని దిక్కులన్
దొద్దలు పుచ్చి తల్లిచనుదోయి నరిందలకట్టు మించగా
ముద్దులు సూపుచున్ పసిడి ముద్దగతిన్ తొడమీద నాడునా
ముద్దు గణేశునిన్ దలచి మ్రొక్కెద నీకృతి కార్యసిద్ధికిన్

***"సింహాసన ద్వాత్రింశిక"*** ***కొరవి గోపరాజు***

తల్లులు తమ కొడుకులను వడిలో పెట్టుకొని కూర్చున్నపుడు సాధారణంగా వారి తల తల్లియొక్క చనుకట్టును తాకుతూ ఉంటుంది. ఇది పరిపాటి.

పార్వతి వినాయకుని చక్కగా బాలపాలిమితో అలంకరించి ఒడిలో ఉంచుకొని కూర్చున్నది. అపుడు అతని శరీరంపైగల నగలలోని మణులకాంతులు అన్ని దిక్కులను కొల్లగొడుతుండగా తనయొక్క కుంభస్థలం తల్లియొక్క చనుకట్టును ఒరుస్తు దాన్ని మించుతుండగా ముద్దులు మూటగట్టుతూ తల్లి ఒడిలో ప్రాణంవచ్చిన బంగారు ముద్దవలె ఆడుతున్న బాలగణేశునికి ఈకృతి కార్యం చక్కగా నెరవేరటానికి నమస్కరిస్తున్నాను.

చ॥ కరతల మంత జాటి పులకండము సెయ్యియు బిండియుండ్రముల్
పారిబోరి గళ్ళ నేరయుచును బుగ్గల బెట్టుచు బావుకొంచున
చ్చెరువుగ లీలతో నమ్ములి చిక్కుచు సొక్కుచు గౌరిముందఱన్
గురువులు వారు వ్రేగడుపు గుజ్జుడు మాకు బ్రసన్నుడయ్యెడిన్

***"వీరభద్ర విజయము"*** ***బమ్మెర పోతన***

తొండంచాపి కలకండ, నేయి, పిండితో చేసిన గుండ్రాళ్ళు కలిపి పదేపదే ముద్దలు చేసి బుగ్గలకు పెట్టుకుంటు నోటిలోనికి తెచ్చుకుంటు చూచేవారి కాశ్చర్యం కలిగేటట్లుగా నములుతూ పరవశిస్తూ విలాసంగా పార్వతి ముందు పరుగులు పెట్టే బొజ్జగలవాడు మనకు ప్రసన్నుడగుగాక !

వినాయకుడు తిండిపోతు కనుక దీనిలో ఏనుగులు మావటివారందించే ముద్దలు నమిలే తీరు వర్ణించబడింది. అంతేకాక ఇందులో అన్నం ముద్దలు నోటిలో పెట్టుకుని నములుతూ తల్లిముందు పరుగులు పెడుతూ ఉండే ఒక చిలిపి బాలుడు గూడ కనిపిస్తాడు.

చ॥ పెనిమిటితోడ శీతమహి భృత్పతి కన్యక జూదమాడి గె
ల్చిన హిమదర్శి రేఖదన చేతికి నిచ్చిన బాల్య చాపలం
బున కబళింపగా విరిగిపోయిన కొమ్మను వచ్చినట్లు మిం
చిన కరివక్త్రు డీశ్వర నృశింహునకున్ వరదుండుగావుతన్

***"వరాహ పురాణము"*** ***నందిఘంటల జంట***

కేయూరీకృత కంకణీకృత జటాజూటా వతం సీకృతస
జ్యావల్లీకృత కుండలీకృత కటీ సూత్రాకృతా హీశ్వరః
పాయాద్వస్తిలకీకృతా ప్రియతమా దర్శీకృతా క్షీకృతా
ద్యూతారమ్య పణీకృతేందు శకలః కాత్యాయనీ కాముకః

పరమ శివునికి అల్లెత్రాడు, శిరోభూషణం, కుండలం, కంకణం, కటిసూత్రం, కాలి అందెయైన ఆదిశేషుడు, పార్వతికి తిలకం ముఖం చూచుకునే అద్దం, శిరోభూషణం, జూదంలో గెలుచుకునే పణం అయిన చంద్రుడు మనల రక్షించుగాక ! అనే ఈ సంస్కృత చాటువును బట్టి చంద్రరేఖను పార్వతి అపుడపుడు శివునితో జూదంలో గెలుచుకుంటుంది. అని తెలుస్తుంది.

ఒక పర్యాయం ఆమె అలాగే గెలుచుకున్న నెలవంకను బాలుడైన వినాయకుని చేతికీయగా చిన్నపిల్లలకు ఏ వస్తువిచ్చినా దాన్ని వెంటనే నోటిలో పెట్టుకునే అలవాటు. కాబట్టి అతడా నెలవంకను నోటిలో పెట్టుకోగా అది అతనికి విరిగిపోయిన కొమ్ము మళ్ళీ మొలిచినట్లు కనిపించింది. అటువంటి ఆ బాలగణపతి పాఠకులకు వరాలిచ్చేవాడు అగుగాక !

పంది కోరలను ఏనుగుపిల్ల దంతాలను నెలవంకలతో పోల్చటం కవులకు పరిపాటియే కనుక ఈ పద్యంలో శివుని తలపైగల నెలవంకను గ్రహించి ఈ కవులు చేసిన ఊహ అద్భుతంగా ఉంది.

ఈ పద్యంలో నుతింపబడినవాడు ఏకదంతుడైన బాలగణపతి చేతికిచ్చిన గిలకలు నోటిలో పెట్టుకునే ఈడు. శిశువులకపుడే దంతాలింకా మొలిచి ఉండవు. ఏనుగు పిల్లకుగూడ అంతే. అది

పాలుమరచిన తర్వాతగాని కోరలుమొలవటం మొదలుగాదు. బాలగణపతికి అప్పుడే కోరలు మొలిచి ఒక కోర విరగటం జరిగి ఉండదు. అది అతడు ప్రౌఢమైన వయస్సులో జరిగింది. కాబట్టి సుకృత కవుల ఊహ అద్భుతంగా ఉన్నా పాత్రౌచిత్యం దెబ్బతిస్తుంది. అది అప్పుడే కనిపిస్తే పుట్టుకు వచ్చిన కోరవలె ఉన్నది. అంటె ఈ కల్పన ఎంతో ఔచిత్య భాసురంగా ఉండేది.

మ॥ ధననాథ ప్రియు కంఠకాళి మము మోదంబొప్ప నెక్కించి చ
యాన జంబూఫల మంచు డాసి నిజ హస్తాగ్రంబు వేఁజాచియే
పున బల్మారును బట్టి తాఁ దిగుచు వేల్పుంబ్రోడ విఘ్నేశ్వరుం
డను మోదంబునఁజేయు మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్నమున్

**"రుక్మాంగద చరిత్రము"** **ప్రౌఢకవి మల్లయామాత్యుడు**

శివుని యొక్క కంఠమంలోని నలుపును చూచి అది నేరేడు పండనే భ్రాంతితో దగ్గరకు చేరి దాన్ని తిందామని తన తొండాన్ని చాపి ఆ నలుపును పదేపదే పట్టి లాగుతూ ఉండే వినాయకుడు ఈ కృతికి నిర్విఘ్నత కలిగించుగాక !

ఈ పద్యం గూడ మత్తేభం ఏనుగులకు చెట్లకుండే పండ్లు తొండం చాపి తెంచుకుని తినే అలవాటు కనుక అదే ఇందులో వర్ణింపబడింది. కవిగారికి ప్రౌఢకవి అని బిరుదు కాబట్టి ఇందులో వినాయకుని గూడ ప్రౌఢుని చేసినాడు.

మ॥ అవనీ భృత్తన యాపదాంబు రుహసేవాయాత దేవాంగనా
శ్రవణీక్లప్త విపుల్ల నిర్జరధునీ సంజాత నీలోత్పల
ప్రవదు ద్యన్మకరంద లుబ్ధ మధులిట్సంఘాత జంబూఫల
ప్రవణత్వోద్ధృత హస్తునిన్ గజముఖున్ ప్రార్థింతు నశ్రాంతమున్

**"సుకవి జనమనోరంజనము"** **కూచిమంచి వెంటరాయడు**

ప్రాచీన సాహిత్యంలో యువతులు కర్ణావతంసంగా నీలోత్పలాలు ధరించటం ప్రసిద్ధంగా కనిపిస్తుంది. అవి వారినే త్రోత్పలాలతో పోటీపడుతుండేవి. పార్వతీదేవి సేవకు వచ్చిపోతూ ఉండే దేవతాస్త్రీలు ఆ విధంగా ఆకాశగంగలో చక్కగా విచ్చిన నల్లకలువలు ధరించి వస్తుండగా వానినుండి జారుతూ ఉండే తేనెకై మూగే తుమ్మెదలను చూచి నేరెడు పండ్లనుకొని వానినందుకోవటానికై ఆ వచ్చిపోయేవారి కర్ణోత్పలాల పైకి పదేపదే తొండాన్ని చాపుతున్న గజముఖుని నేనెల్లపుడు ప్రార్థిస్తున్నాను.

ఈ పద్యంలో గూడ వినాయకుని పిల్లచేష్ట మనోహరంగా చెప్పబడింది.

ఉ॥ నిండి మహామునీశ్వరులు నిర్జర కోటులు చూచుచుండగా
తుండమునందు నందుగొని తోరపుబండులు పిండివంటలున్

దండిగ దించుమించి తలితండ్రులకున్ ప్రమదంబు జేయునే
దండముఖుండు చుండిపుర ధాముని కాళన ధన్యుజేయుతన్

**"మల్హణ చరిత్ర"** **ఎడపాటి ఎర్రన**

వినాయకుడు లంబోదరుడు. తిండిపోతు అతడు దేవతలు, దేవర్షులు అందరూ ఆశ్చర్యంతో చూస్తుండగా తొండంతో తనకు నివేదించిన పెద్దపెద్ద పండ్లు పిండివంటలు అందుకొని దండిగా ఆరగిస్తూ తలిదండ్రికి ఆనందం చేకూర్చే గణపతి మిమ్ములను ధన్యుని జేయుగాక !

ఇందులో ఏనుగు తిండి చూపించబడింది. వినాయకునికి ఏనుగు తల ఉంది. కాబట్టి అందుకే అంత పెద్ద కడుపు. అందుకేనేమో అతడు తిండిపోతయినాడు.

చ॥ పొలుపుగ నీశు కంఠమునఁ బూనిన యట్టి కపాల మాలికల్
వలనుగ జూచి గొప్పలుగ వండిన యుండ్రములంచు భ్రాంతి లో
పల జనియించి తుండమున బట్టి వడిం దివియంగ జూచు వి
ద్యల గురు డేకదంతుడు ముదంబున మత్కృతి బ్రోచుగావుతన్.

**"రాజశేఖర విలాసము"** **కూచిమంచి తిమ్మకవి.**

ఈ పద్యంలోని వినాయకుడు ఉండ్రాళ్ళ తిండిపోతు వినాయకుడు ఉండ్రాళ్లంటె ఇష్టపడేవాడు కాబట్టి శివుడు కంఠంలో ధరించిన కపాల మాలను చూసి ఓహో ఇవి పెద్దపెద్దగా చేసి వండిన ఉండ్రాళ్ళని భ్రమపడి వాటిని తీసికొని తినటానికి తొండంతో లాగుకోజూచే ఏకదంతుడైన వినాయకుడు నా కృతిని రక్షించుగాక.

ఈ పద్యంలోని కవి వినాయకుని విద్యలగురుడేకదంతుడు అని విశేషించటం గమనించదగింది. దంత శబ్దానికి జ్ఞానమనే అర్థంకూడ ఉంది. ఇపుడు గూడ మానవులకు జ్ఞానదంతాలు వచ్చిన పిమ్మటనే లోక వ్యవహారాలు తెలిసి రాసాగుతవి. కాబట్టి ఏకదంతుడైన అనగా ఏకైకమైన అఖండ జ్ఞానం కలిగిన వినాయకుడు విద్యల గురువు కావటంలో వింతలేదు.

వినాయకుడు తనయొక్క విపులమైన జ్ఞానంచేత విద్యలన్నిటికి గురువు కనుక అతడు విద్యాసంబంధమైన నాయొక్క ఈ రచనను రక్షించుగాక !

ఉ॥ ముద్దులు గుల్క శైలసుత ముందర శైశవలీలనాడు చో
నొద్దిక నున్న తండ్రి తల యూచ జటామకుటాగ్ర రేఖపై
సిద్ధపు నబ్జ మోహమున నెమ్మిక రాగ్రము సాచు వేలు పుం
బెద్దగణేశు గొల్తు మద భీప్సిత కావ్య కళానిరూఢికిన్

**"శుకసప్తతి"** **పాలవేకరి కదిరీపతి**

బాల్యంలో తల్లుల ఎదుట పిల్లలు తమ బాల్య క్రీడలు చూపుతూ ఉండటం సాధారణంగా అన్ని కుటుంబాలలో ఉండేదే. అపుడు సతిపతులిద్దరు తీరిపారి కూర్చున్న వారైతె ఆ ఆనందం ఇంక అడుగ నక్కరుండదు.

ఈ పద్యంలో వినాయకుడు శివుని తలపైగల చంద్రరేఖను లాగ చూస్తున్నాడు. ఇది గమనింపవలసిన విషయం.

శివుడు, పార్వతి, వినాయకుడు ఈ ముగ్గురు తమ శిరస్సుపై చంద్రకళను ధరించినారు. చంద్రుని కళలు పదారు. దానిలో శివుడు ధరించింది పన్నెండవ కళ. దేవి ధరించింది పదారవ కళ. చంద్రుని యొక్క పన్నెండవ కళకు శ్రీ అనిపేరు కనుక ఆ కళను లాగజూచే బాలవినాయకుని కవి తన కావ్యానికి కళానిరూఢిని ఈయటానికి సేవిస్తున్నాడు. అనగా అతడు కవుల యొక్క కావ్యాలకు శ్రీనియిచ్చే వాడని సూచన.

వినాయకుడు తల్లి ఎదుట ముద్దుముద్దుగా ఆడే అపుడా లీలకు శివుడు సంతసించి తలూపగా అతని శిరంపై ఉండే చంద్రరేఖను జూచి అది అచ్చమైన తామరయనుకొని, ఏనుగులకు తామర తూండ్లు పూలు అంటే ఇష్టం కాబట్టి దానికై తొండం సాచే దేవుని నేను సేవిస్తున్నాను.

మ॥ ప్రమదాధీన శిరోగ్రభాగ విలసత్ప్రాలేయరుక్ఖండముం
బ్రమదం బొప్పగ జూచి మోదకముగా భావించి యంచత్కరా
గ్రము పైకెత్తి కడంక తోడ దివియంగామించి యేతెంచు దం
తిముఖుండెప్పుడు బ్రోచు మత్కృతి దయార్ద్రీ భూత చిత్తంబునన్

**"రసికజన మనోభిరామము"** **కూచిమంచి తిమ్మకవి**

శివుని తలపై ఉన్న చంద్రఖండాన్ని చూచి కుడుమని భావించి వినాయకుడు కుడుముల మెక్కేవాడు కాబట్టి సంతోషంతో తనయొక్క ప్రకాశమైనతొండాన్ని పైకెత్తి దాన్ని క్రిందికి లాగటానికి శివుని సమీపానికి వచ్చే వినాయకుడెల్లపుడు దయతో మిమ్ములను బ్రోచుగాక !

వినాయకునికి కుడుములంటె మహా యిష్టం. కాబట్టి ఇక్కడ చంద్రుని చూచి కుడుమని భావించి దాన్ని తీసికోవటానికి చేయి = తొండం సాచినాడు. ఇది పిల్ల తనపు చేష్టకాబట్టి యితడు బాలవినాయకుడు.

చ॥ జనకభుజ ద్వయాగ్రమున చక్కగనిల్చి తదుత్తమాంగ మం
దునగల వాహినీ విమల తోయములన్ దననీడగాంచి నా

యనుజుని మీద బెట్టుకొనె నప్పయటంచును తల్లితోడ జె
ప్పిన నగిబుజ్జగింపగను ప్రేమజలంగు గణేశు గొల్చెదన్

**"అలమేలుమంగా పరిణయం"** **తూము రామచంద్రారెడ్డి**

సంతోషవేళలో తల్లిదండ్రులు అపుడపుడు తమ కుమారులను భుజాలపై ఎక్కించుకుని ఆడిస్తు ఆనందించటం లోక సహజం. ఒకపుడు శివుడట్లా వినాయకుని భుజాలపై ఎక్కించుకోగా శివుని తలపై ఉండే గంగలో తన నీడను చూచి వినాయకుడా ప్రతిబింబం తన సోదరునిదని భ్రమపడినాడు. ఇది ఒక్క అతని వంతేగాదు పార్వతికిగూడ ఒకపుడట్లాగే జరిగింది.

మ॥ చెలువల్ కౌగిట గ్రుచ్చి యెత్తి తలబ్రావోయించు నవ్వేళ నౌ
దలగంగన్ దననీడ తానెగని మౌగ్ధ్యం బొప్పె వేరొక్క తో
య్యతి యంచున్ మదినెంచు

అని పారిజాతాపహరణంలో నంది తిమ్మన చెప్పినాడు. అతడు నందిగాబట్టి శివపార్వతుల నడుమ గడిచిన ఈ సంఘటన అతనికి తెలిసింది. మరిపుడు గణపతి ఆ తల్లి కుమారుడేగదా ! ఆ చీరల నిదే ఆ కణుంగాబట్టి ఆ భ్రాంతి అతనికి మాత్రం ఎందుక్కలుగదు ? అది కలిగి అమ్మతో నాన్నగారు తలపైనా తమ్ముని ఎక్కించుకున్నాడని పితూరి చేయగా తల్లి అది విని నవ్వుకొని కొడుకును దగ్గర తీసికొని నాయనా! పెండ్లినాడు నేనుగూడా నీలాగే భ్రమపడ్డాను కాని ఆలాటిదేమి కాదు. అని బుజ్జగించింది. అపుడా బుజ్జగింపుకు ఆనందంతో చెంగలించిన గణేశుని నేను సేవిస్తున్నాను.

కవి యిక్కడ గణేశుడని జాగ్రత్త పడినాడు కాని గజాననుడంటె యిక్కడ ఈ భ్రాంతి కవకాశం లేదు.

మ॥ తనయా రమ్మని గౌరితన్ను బిలువం దత్పార్శ్వముంజేరబో
వనటన్ భీమ మహాంకుశాయుధము గన్పట్టంగనన్యోరు సీ
మను జేరంగని పుత్రుకౌగిటను ప్రేమంజేర్చు శర్వాణి గ
న్గొని స్మేరానన మొప్ప గ్రాలు గజవక్త్రుండిచ్చు నిర్విఘ్నముల్

**"బ్రహ్మాండ పురాణము"** **జనమంచి శేషాద్రిశర్మ**

శివుడు ధరించే ఆయుధాలలో అంకుశం ఎపుడు కుడివైపు చేతులలోనే ఉంటుంది. అందుచేత కవి ఇక్కడ పారవితి యొక్క కుడిచేతిలో అంకుశాన్ని ఉంచి మనకు ఆ సంప్రదాయాన్ని తెలిపినాడు.

పురుషునికి కుడి తొడ కొడుకు, ఎడమ తొడ భార్య కూర్చోదగినవి. స్త్రీకైతే కొడుకు ఎడమ తొడపైనే కూర్చొవలె. వినాయకుడు బాలుడు కనుక ఆ సంప్రదాయం తెలియక కుడితొడ నెక్కబోయి

ఆవైపు పురుషరూపం ఉండటం వల్ల రెండవవైపునుండి వెళ్ళి ఆ తల్లియొక్క పుత్రప్రేమను చూరగొన్నాడు.

పార్వతి అర్థనారీశ్వరి కనుక ఆమె కుడివైపు భాగం పురుష శరీరంగా ఉంటుంది. పెద్దనగారు బాలవినాయకునిలో ఆ భాగాన్ని ఆటపట్టించగా వినాయకుడు గజముఖుడు కనుక శివుని ఆయుధాలలో ఒకటైన అంకుశాన్ని ఆవైపు ఉంచి అతనిని తండ్రికి భయపడే పిల్లవానిగా ఈ కవి దీనిలో తీర్చినాడు.

ఇట్లా ఈ పద్యం చూసే అందుకు అతి సామాన్యంగా అనిపించినా ఒక సంప్రదాయాన్ని పొదువుకున్నది.

మ॥ అలకైలాసగిరి ప్రదేశమున సింహారూఢయౌ తల్లితన్
బిలువన్ భీతిలి డాగుచో శివుడు బల్ప్రేమన్నిజాంకోజ్జ్వల
స్థలి నాసీనునొనర్చి ముద్దిడ ప్రమోదం బొంది దానోర చూ
పుల తల్లింగని నవ్వు హస్తివదనున్ బూజింతు నశ్రాంతమున్

**"శ్రీ చౌడీశ్వరీ మహాత్మ్యము"** **గుమ్మరాజు రామకవి**

కైలాసగిరిపై ఒకనాడు తల్లియైన పార్వతి సింహవాహనంపై ఉండి గణపతిని దగ్గరకు పిలువగా అతడు గజవదనుడు కనుక ఏనుగుకు సింహానికి పడదు కాబట్టి భయపడి దాగినాడు. అపుడు శివుడది చూచి ప్రేమతో పిలుచుకొని తన తొడపై కూర్చోబెట్టుకొని ముద్దుపెట్టుకున్నాడు. అపుడతడు తల్లివైపు నీవేనా నాయన మాత్రం నన్ను లాలించదా ! అన్నట్లు ధీమాతో కూడిన నవ్వుతో చూస్తున్న గణపతిని నేనెల్లప్పుడు పూజిస్తున్నాను.

పిల్లలకు తల్లిదండ్రి ఇద్దరిలో ఎవరిదో ఒకరి లాలన అవసరం. తండ్రి భయంకరుడైనపుడు తల్లి, తల్లి భయంకరురాలైనపుడు తండ్రి ఇట్లా ఎవరో ఒకరు వారిని లాలించేవారు కావలెగాని యిద్దరు కొరివి దయ్యాల్లు కాగూడదని ఈ పద్యంలోని ధ్వని.

తల్లియొక్క వాహనానికి భయపడినాడు కనుక నితడు గూడ బాలగణపతియే.



# కుమార గణపతి

ఉ॥ శంకరు మూపుజేరి శిరసంగల చందురులోని జింకకున్
గొంకక చేయిజాపినను గోత్రజ జూచి యితండు దెచ్చు పెన్
అంకటులుండ వేరొకటి రంకిటు దెత్తుర వల్దటంచు దా
నంకముజేర్చి చనుద్గుప నాడెడు భద్రగ జాస్యుగొల్చెదన్

**"గౌరీవిలాసము"** **వేము రామాభట్టు**

ఈ పద్యంలో రంకుపై శ్లేష - రంకు = తంటా; జగడము - అంకు = జింక

ఈ రెండు పదాలకు లిపి భేదమే కాని ఉచ్చారణ భేదం స్పష్టంగా గన్పించదు.

ఒకనాడు వినాయకుడు తండ్రి పాపులపై ఉండి అతని తలపై ఉండే చంద్రునిలోని జింకను తొండంచాచి పట్టుకోబోగా దాన్ని చూచి పార్వతిదేవి కొడుకుతో నాయనా! మీ తండ్రిగారిప్పటికే తలపై గంగ నెత్తుకొని నాకొక రంకును తెచ్చిపెట్టినాడు కాబట్టి ఉన్న రంకొకటి అనగా సవతి తంటా ఉండనే ఉండగా నీవింకొక అంకెందుకు తెస్తావు. అనగా ఆ చంద్రునిలోని జింకను పట్టుకొని మరొక తంటా ఎందుకు తెస్తావు వద్దు ! ఇటురా అని పిలుచుకుని తొడపై కూర్చుండబెట్టుకుని చన్నీయగా ఆ పాలుద్రావి ఆడుకుంటున్న గణపతిని సేవిస్తున్నాను.

కవి ఈ పద్యంలో భద్రగజాస్యుని అనటం సాభిప్రాయవిశేషణం. తిల్లి మాటవిని అతడు మరో రంకు తేకుండా నిలిచినాడు గాబట్టి భద్రగజాస్యుడు అనగా వారికి భద్రాన్ని చేకూర్చే గజాస్యుడైనాడు.

ఉ॥ కొమ్మును తొండమున్ కఠిన కుంభయుగంబును నయ్యుమాక పో
లమ్ముల చారుకాంతి దొడలన్ వలి చన్నులబోలె పుత్ర కుం
డిమ్ముల తల్లిబోలి జనియించిన నంచిత భాగ్యవంతుడౌ
నమ్మయటంచు సిద్ధ సతులక్కున జేర్చు గజాన్య గొల్చెదన్

**"కన్నప్ప చరిత్ర"** **కంచి రాజు సూరయ్య**

వినాయకుడు జైనమతంలో సిద్ధగణంలో ఒకడు. శివపురాణం ప్రకారం అతడు పిండిబొమ్మ సుప్రభేదాగమం ప్రకారం శివపార్వతులకు సద్యోగర్భంలో జనించిన తనయుడు.

ఒకనాడు వారు కైలాసంపైగల ఆనంద కాననానికి విహారానికివెళ్ళి అక్కడ క్రీడాసక్తమైన ఒక గజ మిధునాన్ని చూసి తాము కూడా గజరూపాలు ధరించి క్రీడించగా అతడు జనించినాడట.

లోకంలో కుమారుడు తల్లిపోలికలతో కూతురు తండ్రి పోలికలతో జన్మిస్తే భాగ్యవంతులౌతారని నమ్మకం ఆ నమ్మకాన్ని కవి ఇందులో ప్రతిపాదించినాడు.

బాలవినాయకుని ఒకనాడు సిద్ధసతులు వచ్చి ఎత్తుకుని అతని అందచందాలు చూచి తమలో తాము చూసినారా ఈ బాలుని యొక్క కుంభస్థలం తల్లియొక్క (పార్వతి యొక్క) చనుకట్టువలె దంతం ఆమె చెక్కులవలె, తొండం ఆమె యొక్క తొడలవలె ఉన్నవి. మగపిల్లవాడు తల్లి పోలికలతో జనిస్తే భాగ్యవంతుడౌతాడు గదా ! అనుకుంటూ ఎదలకు హత్తుకున్నారు. అటువంటి గజాననుని నేను సేవిస్తున్నాను.

కావ్య మర్యాదలో స్త్రీలయొక్క రొమ్ములను ఏనుగు కుంభస్థలాలతో చెంపలను ఏనుగు దంతాలతో తొడలను ఏనుగు తొండాలతో పోలుస్తుంటారు. ఆ ఉపమా సామగ్రిలో కవి యిందులో వినాయకుని అపూర్వంగా చిత్రించినాడు.

ఈ పద్యంలో వినాయకుడు భాగ్యవంతుడుగా చెప్పబడినాడు. అతడు విద్యలకే గాక సంపదలకు కూడా అధిదేవతనే.

ఉ॥ గ్రక్కున నేత్రయుగ్మము కరద్వితయంబున మూసి పట్టి యా
మిక్కిలి కంటికిన్ తనదు మూడవ హస్తము మాటుచేసి ఇం
పెక్కడు బాలకేళి పరమేశ్వరు చిత్తము పల్లవింపగా
తక్కక ముద్దునం బొలుచు దంతి ముఖున్ గొలుతున్ ప్రసన్నుగాన్

"దశకుమార చరిత్ర" కేతన

ఈ పద్యంలోని వినాయకుడు దాగుడు మూతలాడిస్తు దర్శనమిస్తాడు. బాలకేళిలో అతడు దాగుడు మూతలాడుతూ అనగా రెండు చేతులతో పరమశివుని యొక్క రెండు కన్నులు మూసి మూడో కంటికి తనయొక్క తొండాన్ని మాటుచేసి శంకరుని మనస్సుకు ఆహ్లాదం కలిగించినాడు. అటువంటి గజాననుని నేను సేవిస్తున్నాను.

కవి యిందులో వినాయకుని దంతిముఖుడు అని చెబుతూ శివుడు త్రినేత్రుడు కనుక అతని మరో కంటిని మూయటానికి గణపతి మూడవ చేయిగా తన తొండాన్ని ఉపయోగించినట్లు చమత్కరించినాడు.

కవియొక్క భావనకు దంతిముఖుడనే పర్యాయం ఇక్కడ సహకరించదు. కనుక కేతన యిక్కడ కరిముఖుడు లేదా హస్తిముఖుడు అని ఉండవలసింది.

ఉ॥ పొంద్దుగ నీశు ముందటను బొజ్జగ దల్చుచునాడుచుండగా
విందులు విందులంచు నరవింద దళాయత నేత్ర గౌరియా

నందముతోడ బిల్చినను నవ్వుచు దానెదురేగు పార్వతీ
నందను లోకవంద్యు గణనాథుని గొల్చెద నిష్ట సిద్ధికిన్

**"ధనాభిరామం"** **సూరన**

గణపతి మొదట శివుని ముందు బొజ్జ కదులుతూ ఉండగా ఆడుతుండగా అది చూచి పార్వతి బాగుబాగు ఇటురారా ! నాముందుగూడ చిందులు వేతువు అని పిలువగా నవ్వుతూ ఆమెకు ఎదురుగా వెళ్లుతున్న గణపతిని యిష్టసిద్ధికై సేవిస్తున్నాను.

ఈ కవి సూరన అనగా సూర్యుడు అతడు జగచ్చక్షువు కాబట్టి ఇందులో తన పేరుకు తగినట్టు అరవింద దళాయనేత్రయైన పార్వతియొక్క వీక్షణ వ్యాపారాన్ని చెప్పినాడనవలె.

చ॥ కరిముఖుడున్ కుమారుడు వికారపు చేతలముద్దు సూపుచున్
గురువులు వారుచున్ నెదుటగానగ దాటుచు చన్ను దోయితో
శిరములు రాయుచున్ కబరి జేర్చిన చంద్రుని బట్టి తీయగా
కరముల జాప నవ్వెడు జగమ్ముల తల్లి శుభంబు లీవుతన్

**"మొల్ల రామాయణము"** **మొల్ల**

పడకపై పతిదాడి వర్ధన వేళ బంధువులదాడి తీరిపాలిన వేళలో పిల్లలదాడి కలుగవలెనని యింతులకు మన వారి పెద్దల దీవెన. దాన్ని అనుసరించి మొల్ల స్త్రీ కనుక గణపతి కుమారస్వాముల నాధారం చేసికొని పార్వతీదేవి ముఖంగా ఈ పద్యంలో పిల్లలు గల ఒక యిల్లాలిని చక్కగా ఆవిష్కరించింది.

వినాయకుడు కుమారస్వామి పిల్లతనపు చేష్టలతో తన ఎదుట ముద్దులు చూపుతూ పరుగులు తీస్తు, గంతులు వేస్తు తలను రొమ్ములకు రాస్తు గెలువనీయకుండజేస్తు తలపై తురుముకున్న చంద్రరేఖను తీయటానికి చేతులు చాపగా అది చూచి నవ్వుకునే తల్లియైన పార్వతి మీకు శుభాలిచ్చుగాక.

మొల్ల స్త్రీగాబట్టి ఇందులో పార్వతిని జగముల తల్లియని చెప్పటం ఆమె ప్రత్యేకత.

చ॥ తనుగని యొక్క యెత్తునవెదక్షజయున్ విటలాక్షుడున్ ముదం
బున నిరు చెక్కులన్ గదిసి ముద్దొసగంగ నొకింత నెమ్మొగం
బును వుగవెన్కకున్ దిగిచి యత్న విహీన పరస్పరాస్య చుం
బనములు తల్లిదండ్రులకు పన్నుగ గూర్చు గజాస్యునెన్నెదన్

**"అప్పకవీయము"** **అప్పకవి**

గణపతి హాస్యానికి అధి దైవం. లక్షణశాస్త్ర ప్రకారం హాస్యం శృంగారం నుండి పుట్టింది. అయితే ఈ పద్యంలో అప్పకవిగారు హాస్యం నుండి శృంగారాన్ని పుట్టించినారు. అది ఏలాగో గమనించండి.

ఒకనాడు వినాయకుని చక్కగా అలంకరించి ఒక ఎత్తైన పీటపై కూర్చోబెట్టి తల్లిదండ్రి చెరోవైపు నిలిచి "నాయనా ! ఒక ముద్దీయరా !" అని ఒకేసారి చెరోవైపునుండి అతన్ని ముద్దు పెట్టుకోబోయినారు. అపుడా కొంటెగాడు వారు ముద్దుపెట్టుకునే సమయంలో తటాలున తలవెనక్కు లాగుకున్నాడు. అపుడేమయింది. అనుకోకుండానే ఆ తల్లిదండ్రి ఒకరికొకరు ముద్దిచ్చుకున్నారు.

ఆ విధంగా అప్రయత్నంగానే తల్లిదండ్రులకు పరస్పరం చుంబించుకునే అవకాశం కలుగజేసిన గణపతిని నేను సేవిస్తున్నాను.

అప్పకవి ప్రభావం గూడ ఆంధ్రదేశంలో అనేకులపై ఉంది.

చ॥ మనసిజ వైరి గౌరియును మక్కువ నొక్కట చెక్కు దోయి చుం
బనమొనరింపగా నెరిగి మస్తము వెన్క కెడల్ప వారణం
పున దనమోము లొండొరులు ముద్దుగొనంగని నవ్వు నాగ జా
నను భజియింతు నేనను దినంబు మనోరథ సిద్ధికింగదన్

**"అనర్ఘరాఘవము"** **బజ్జ తిమ్మభూపాలుడు**

బజ్జన తిమ్మభూపాలుడు అలంపురం సంస్థానాన్ని పాలించిన ప్రభువు. స్వతంత్రమైన కల్పనా శక్తిగలవాడు. ఇది అతనికి అప్పకవిపై ఉన్న భక్తికి అభిమానానికి గణపతి సాక్షిగా నిల్పిన ఒక అక్షర శిల్పం.

ఉ॥ పుట్టదు పూరినాతలను బుట్టిన కుంభములందు నీయెదన్
బుట్టిన కుంభయుగ్మమున బుట్టె సుధారసధార తెల్పు మీ
గుట్టని పోరువెట్టు నలకుంజర వక్త్రుని జూచి నవ్వు నా
గట్టులరేని పట్టి దయ ఖండోజిరాయని బ్రోచుగావుతన్.

**"ఘటికాచల మాహాత్మ్యము"** **తెనాలి రామలింగకవి**

పూరి అనగా జంతువుల పాలు.

స్త్రీలయొక్క చనుకట్టును ఏనుగు కుభాలతో పోల్చటం ఉపమా సామగ్రిలో ఒకటి వినాయకు డొక పర్యాయం తల్లి యొక్క రొమ్మును చూచి అమ్మా! నా తలపై పుట్టిన కుంభయుగ్మంపై ఒక్క పాలచుక్క గూడా పుట్టదు. మరి నీ యెదపై పుట్టిన కుంభయుగ్మంలో పాలెట్లా పుడుతున్నవి ఈ రహస్యం నాకు చెప్పవా ! అని పసితనం యొక్క మౌగ్ధ్యంలో పోరుపెట్టి అడుగుతుండగా ఆ కుమారుని చూచి నవ్వుకున్న పార్వతి మనలను రక్షించుగాక !

ఇది ఘటికాచల మహాత్మ్యంలోని స్తుతి. ఘటం కుంభం రెండూ సమానార్థకాలే కాబట్టి ఆ శబ్ద సామ్యంచేత కవి యిక్కడ ఘటతుల్యమైన పార్వతీదేవి వక్షోజ మాహాత్మ్యాన్ని అవి గజకుంభాలకంటె విశేషమైనవని ధ్వనింపజేసినాడు.

ఉ॥ మంచము జేరి శంభుడు కుమారుని తొట్లెను బెట్టి నీవు చే
లాంచల మేల పట్టుకొనెదమ్మకడంజను మన్న భక్ష్యమి
మ్మంచని పోర చంద్రకళ నక్కరకై నిడకేల ద్రోయుచున్
త్రుంచిన దోసెయంచవెదు తీరవు బొజ్జగలాని గొల్చెదన్.

"పార్వతీ పరిణయము" కోటి రఘునాథ నాయకుడు

సూర్యుడు బోసినోటివాడు. అందువల్ల అతనికి అరటిపండ్లు పిండి నైవేద్యం పెడితే చంద్రునికి అట్లు నివేదిస్తారు. కనుక ఇందులో చంద్రుని దోసెతో పోల్చటం శాస్త్ర మర్మమెరిగిన సొగసు ఆధునికులితనిని ఆకాశమనే ప్లేటులోని ఇడ్లీగా దర్శించినారు.

ఇందులో వినాయకుడు తీరవు బొజ్జ అనగా స్థూలమైన పొట్టగలవాడుగా చెప్పబడినాడు కాబట్టి అంత లావు కడుపుకు ఆ సగం దోసె ఏం చాలుతుంది ? ఏనుగు పంటికి జలకర పోచ.

శివుడు పేదవాడు కొండపీటి జంగం. అంటె అక్కడ బిచ్చమెత్తుకునేవాడు కాబట్టి దీనిలో అతని పేద సంసారం చూపబడింది. తల్లి యింటిలో ఏదో పనిలో ఉండగా ఇద్దరు బిడ్డలను సముందాయించే తండ్రిగా ఇందులో మనకు శివుడు దర్శనమిస్తాడు. ప్రొద్దునే పిల్లలు తిండికొరకు పోరు పెట్టినపుడు వేదకాపులాటలో తల్లిదండ్రి రాత్రి మిగిలిపోయిన ఏ రొట్టెముక్కనో వారిచేతికిచ్చి సముదాయించటం ఇపుడున్నదే. కనుక శివుడు అంతవరకెత్తుకున్న కుమారుని తొట్టిలో వేసి మంచంపై విశ్రాంతి తీసికోబోగా ప్రక్కనున్న గణపతి అతని ఉత్తరీయాన్ని పట్టుకున్నాడు. శివుడది చూచి నన్నెందుకు పట్టుకుంటావు అమ్మ దగ్గరకు వెళ్లు అనగా నాకు తినటానికి ఏదైనా అప్ప ఈయమని అడిగివాడు. అది విని శివుడు దేవతలు చంద్రకళను పానం చేస్తుంటారు కాబట్టి తలపైనున్న నెలవంకను తీసి చేతికీయగా యిది సంగంత్రుంచిన దోసె, నేను వల్లను పొమ్మని ముద్దులుగునిపే లంబోదరుని నేను సేవిస్తున్నాను.

చ॥ అజల తరంగిణీప్రద సితాంబు రుహభ్రమ దాత మౌళిన
క్కజమగు చంద్రు బట్టు నొడికంబున తుండము పైకి చాపి య
ద్రి జనునగించు నొంటిపలు దేవరపూని భుజంగ రాయ భూ
భుజుని నిరంతరాయ సుఖముల్ దయచేసి కృతార్థుజేయుతన్

"ఆంధ్రపరాశర స్మృతి" అదిపూడి ప్రభాకరామాత్య

పరమ శివుడు తలపై ధరించిన చంద్రరేఖను జూచి ఏనుగులకు తామరలంటె చాలా యిష్టం కాబట్టి ఇది ఆకాశ గంగలోని తెల్లతామరయని దాన్ని అందుకోవటానికి తొండంపైకి చాచి తనయొక్క భ్రాంతితో పార్వతీదేవిని నవ్వించే ఏకదంతుడు మనకు నిరంతరాయమైన సుఖాలు దయచేయు గాక !

చంద్రుని ఆకాశగంగలోని సితాబ్జంతో పోల్చటం కవులకు పరిపాటి కనుక దాన్ని అధారం చేసికొని వినాయకునికి భ్రాంతిని ఇంతవరకు పాలవే కరిక దిరివతి చెప్పినాడు. అతడు వినాయకునికి ఆ భ్రాంతి కలుగటానికి చిన్న పూర్వ రంగాన్ని సృజించినాడు. కాని అక్కడ గూడ శివపార్వతులిద్దరున్నా ఈ ప్రభాకరామాత్యుడటువంటి దేదీ లేకుండానే వినాయకునితో నేరుగా శివుని నెత్తిపై చేయిపెట్టించే ప్రయత్నం చేసినాడు. అందుకే కాబోలు అది చూచి ఆమె అద్రిజ అనగా కొండకూతురైనప్పటికీ యిందులో నవ్వింది.

ఈ పద్యంతో భిన్న అనౌచిత్యదోషం కనిపిస్తుంది. వినాయకుని బంటిపలు దేవర అనేకంటే కరివదనుడు లేదా హస్తిముఖుడు అంటె పద్యం ఇంకా ఔచిత్యభాసురంగా ఉండేది.

చ॥ కనకనగంబు బొమ్మరముగా భుజగేంద్రుడు జాలెగానమ
ర్చిన గిరి పుత్రి గాంచి యుప్పి రెండును దేవధనంబులన్న న
జ్ఞన నిహితోప దేశమున సమ్మతి వాని పునఃప్రతిష్ఠ జే
సిన గణనాయకుండు కృపసేయుత సిద్ధన మంత్రి కోరికల్.

"విక్రమార్క చరిత్ర" జక్కన

ఈ పద్యం జంపకం కవి వంశక పర్యాయమైన కనక శబ్దంతో పద్యాన్ని ప్రారంభించటం విశేషం.

బాల్యంలో ఆట ఈడు నాటి గణపతి ఒకనాడు మేరు పర్వతాన్ని బొంగరంగా చేసి దానికి ఆదిశేషుడనే జాలెనుగా చుట్టినాడు. ఈ బ్రహ్మాండంలోని పదునాల్గు లోకాలు తమతమ స్థానంలో నిలువటానికి పురాణవచన ప్రకారం మేరువు మరియు ఆదిశేషుడే ఆధారం. మేరువేగా

శేషుడుగాని తమ స్థానం నుండి ఏమాత్రం కదిలినా ఈ లోకాల స్థితి గందరగోళంలో పడిపోతుంది. అందుచేత అదిచూచి పార్వతి గణపతితో నాయనా నీ ఆటకు తీసికున్న బొంగరం, జాలె ఆ రెండు మనవి కావు. అవి దేవతల సొత్తు దానిని ముట్టగూడదు. అన్నదట. ఆ మాటవిని వినాయకుడు తల్లిమాట మీరని బుద్ధిగల పిల్లవాడు కనుక వానిని మళ్ళీ యథాస్థానంలో అమర్చినాడట.

దేవికి కులగిరులు అచ్చనగండ్లుగా చెప్పబడుతవి. కనుక అటువంటి మహాతల్లి కుమారుడైన గణపతికి మేరువు బొంగరం కావటం ఒక విశేషం కాదుగాని, కొడుకు అంత పరాక్రమవంతుడై గూడ తల్లిమాట మీరకుండా ఉండటం విశేషంలోనికెల్లా విశేషం. కనుక కుమారులెంత గొప్పవారైనా తల్లిమాటనా విధంగా మీరకుండా ఉండవలెననేది ఇందులోని సూచన.

చ॥ జనకుండున్ గిరిజామ తల్లి ప్రణయ స్వాంతాన సంకస్థలం
బున జేర్పన్ నిజగండ భాగములపై మూకొన్న భృంగావళిన్
ఘనకర్ణాంచల చాలనంబున దొలంగన్ ద్రోలు దంతావళా
ననునర్థింతు నభీష్ట సిద్ధికృతి సంధానైక సంరంభినై.

**"పాలంకార కృష్ణదేవరాయలు"** **జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి**

తల్లిదండ్రులిద్దరు ప్రేమచేత తనను తొడలపై కూర్చొబెట్టుకోగా తన గండ స్థలాలపై మదజలం కొరకు మూగిన తుమ్మెదలను చెవులాడిస్తూ పారద్రోలుతున్న గజముఖుని నేను అభీష్టసిద్ధికి ప్రార్థిస్తున్నాను.

ఏనుగులకు అంత పెద్ద చెవులెందుకు? ఏనుగు యొక్క శరీరం చాలా పెద్దది. దాని కడుపుగూడ చాలా పెద్దదే కనుక తినే ఆహారం గూడ ఎక్కువే. మనం తినే ఆహారాన్ని మనం పీల్చుకునే ప్రాణవాయువు దహిస్తుంది. అలా దహింపబడి యంత్రానికి ఇంధనం వలె మన ఆహారం మనకు శక్తిగా మారుతుంది.

అయితే ఏనుగుకు దాని శరీరంలో కావలసిన దానికంటె ఎక్కువగా వేడిమి ఉత్పత్తి అవుతుందట. అందుచేత ఆ వేడిమిని తోడివేయటానికి దాని చెవులు "ఎగ్జాస్టింగ్ ఫ్యాన్స్" లాగా పనిచేస్తుంటవని శాస్త్రవేత్తల మతం. మానవ శరీరాలలో ఈ ఎక్కువైన వేడిమిని తోడివేయటానికి మన పూర్వులు రాగి, వెండి, బంగారాలతో చేసిన కడియాలు మొదలైన నగలు ఉపయోగించేవారు, ఇపుడేమో అవి మోటై అందరూ దేహకాకలతో బాధపడుతుంటారు.

జంతువులన్నిటిలో ఏనుగుకు దాని మదజల ప్రాపం ఒక ప్రత్యేకత. దానికి ఎనిమిది స్థానాలనుండి మదజలం స్రవిస్తుంది. ఆ జలానికి గూడ గజశాస్త్రంలో వేర్వేరు పేర్లున్నవి. అవి ఒకసారి గమనించండి.

1. చెక్కిళ్ళు - దానం  2. కన్నులు - సేధువు

3. కర్ణములు - సాగరం  4. తుండాగ్రం - శీకరం

5. చనుమొనలు - శిక్యం  6. మేహనం - మదం

7. హృదయం - ఘర్మం  8. చరణాలు - మేఘం

ఈ ఎనిమిది స్థానాలలో సాధారణంగా వానికి గండస్థానం నుండి స్రవించే మదమే ఎక్కువ. అదే సర్వసాధారణం గూడ కాబట్టి ఏనుగుకు దాని చెవులదిమ దించినపుడు నుదుటి మదజలానికి వ్రాలి చికాకు కలిగించే తుమ్మెదలను తోలుకోవటానికి వేసవిలో విసనకర్రలవలె విసురుకోవటానికి గూడ ఉపయోగపడుతుంటవి.

ఈ పద్యంలో తలిదండ్రి తొడపై నున్న వినాయకుడు తుమ్మెదలను తోలుతుంటున్నాడనగా అతనూరకనే ఈగలను కొట్టడంగాక ఆ రూపంలో మూగుతున్న ఆటంకాలను తొలగిస్తున్నాడని ధ్వని. కాని ఏనుగులకు మదం పిల్లతనంలో పుట్టదు. ప్రౌఢుడైన గణపతి తల్లితొడపై కూర్చోలేడు. కనుక ఏనుగులకు మదస్రావంలేకున్నా మనముఖంపై ఈగలవలె దాని గండస్థలంపై తుమ్మెదలు వ్రాలుతుంటవని అనుకోవలె.

మ॥ తనయంకంబున బట్టికిం బ్రియుని జేతం జూపినీ తండ్రిపే
రను మయ్యాయన వచ్చిరాని మృదు వాక్యం బొప్పగంగా ధరుం
డన సర్వజ్ఞుడు ప్రేయసీ ముఖము చాయంజూచి మీ యమ్మపే
రనగా చండికయంచు నవ్వెడి గజాస్య బ్రహ్మమమ్మోముతన్.

"మధురస్మృతి"  వఠ్ఠేపల్లి మల్లినాథశర్మ

పార్వతీదేవి ఒకవారు వినాయకునితొడపై కూర్చొబెట్టుకుని అతనికి శివునిచూపి మీ తండ్రిగారి పేరేమి చెప్పు నాయనా అని అడిగింది. ఆమె వారు ఉమాపతి, గిరిశేశుడు, గౌరీశుడు లేక సాంబుడు అంటాడని ఆశించిందికాని అందుకు భిన్నంగా ఆ కొంటెగాడు గంగాధరుడు అన్నాడు. అది విని సవతి పేరుతో చెప్పినందుకు లోలోన ఆమె మండిపోయింది. అది గమనించి సర్వజ్ఞుడైన శివుడు మీ అమ్మ పేరేమిటి నాయనా అన్నాడు. అపుడు వాడు అమాయకంగా "చండిక" అంటూ నవ్వించాడు. కనుక నిటువంటి ఏనుగు ముఖంగల బ్రహ్మ మనలనెల్లప్పుడు కాపాడుగాక.

ఈ పద్యంలో కవి గణపతిని గజాస్య బ్రహ్మ అని విశేషించటం గమనార్హం. గజ శబ్దం జ్ఞానార్థంలోగూడ వర్తిస్తుంది. బ్రహ్మ చతురాననుడు. కనుక దానికి తగినట్లు కవి ఇందులో గణపతి వాక్చాతుర్యాన్ని ప్రదర్శింపజేసినాడు. కావ్యం పేరుకు తగినట్లుగా శివునికి ఈ గణపతి మధురస్మృతి.

మ॥ కరమొప్పన్ జనకాంక యుక్తుడగుచున్ గంగాసువర్ణాబ్జముల్
కెరలింపన్ గరమూన భర్తకది సంకేతక్రియన్మ్రోయద
త్పర వశ్చాదన దృగ్వి శేషనివసద్వామాంకుడై తత్పితృ
స్థిర సమ్మోదనకారి యౌ గజముఖున్ సేవించి కీర్తించెదన్

## "యామినీ పూర్ణ తిలకా విలాసము" చెళ్ళపిళ్ల నరస కవి

గణపతి ఒకనాడు తండ్రి తొడపై కూర్చొని తొండంచాపి అతని తలపై ఉండే గంగలోని బంగారు కమలాలు పెకలించబోగా గంగాదేవి అది శివునికి తెలిసేటట్లు సంకేతంగా ధ్వని చేసింది. అది యెరిగి శివుడతనిని కన్నులతోనే వలదని వారించినాడు. అదిగని తాను తలపెట్టిన పనిని మాని ఎడమతొడపై ఉండి తండ్రికి స్థిరమైన సంతోషం కలిగించిన గణపతినిన నేను కీర్తిస్తున్నాను.

ఆకాశగంగలో బంగారు కమలాలుంటవని ప్రసిద్ధి. శివుని తలపై ఉన్నది ఆకాశగంగ. ఏనుగులకు తామరలను చూస్తే చెలాటం కనుక కవి యిందులో గణపతిని గజముఖుడని చెప్పటం గమనించదగిన విశేషం. గజమనగా యిక్కడ మదించునది అర్థం. మదించినపుడే సాధారణంగా ఏనుగులెక్కువగా కల్లోలాన్ని సృజిస్తుంటవి.

ఉ॥ ఏకకళావతం సమిది ఏటికి పూర్ణకళావతుంసు డే
గాకయటంచు తుండమున గ్రక్కున చంద్రుని బట్ట నా కళం
కాకర చంద్రుడేలయని యంబనివారణ మాచరింపగా
గైకొని తన్ముఖాంబుజము గన్గొను బాలగణేశుగొల్చెదన్

## "మూర్తి త్రయోపాఖ్యానము" దంతులూరి బాపయ

శివుని తలపైగల చంద్రరేఖ ఏకకళ - చంద్రునికి పదునారు కళలు పదారవ కళకు షోఢయాని వ్యవహారం. దాన్ని దేవి తలపై ధరిస్తుంది. పన్నెండవదైన శ్రీ అనేక కళను శివుడు ధరించినాడు కనుక ఏకకళామాత్రమైన ఈ చంద్రుడెందుకు నిండుగా పదారుకళలుండే చంద్రునే ధరించక అని తండ్రి తలపై ఉన్న చంద్రకళను తీసివేయుటానికి తొండంతో పట్టుకోగా నాయనా ! నిండు చంద్రునికి కళంకం ఉందిరా! ఏకరైనా కళంకంగల దాన్ని తలపై ధరిస్తారా ! అది మంచిదిగాదని చెప్పగా ఆ తల్లి మాటవిని తొండంతో తాను పట్టుకున్న చంద్రుని విడిచి ఆ నిండు చంద్రునివలె ఉండే తల్లి ముఖ పద్మాన్ని చూస్తున్న బాలగణపతిని నేను సేవిస్తున్నాను.

బాలగణపతి ఇందులో తల్లిముఖం చూస్తున్నాడనగా నిజమే ఆకాశంలో ఉండే నిండు చంద్రునికి కళంకం ఉంది కనుక కళంక రహితమైన ఈ ముఖచంద్రుడుండగా యింక ఆ చంద్రుడెందుకు? అని వినాయకుడు తలచినాడని యిందులోని ధ్వని.

మ॥ కలుగున్ లాయపు తేజికిన్ చయము మైగాన్పించు నీ శాను
మ్ములకున్ తమ్ముని కత్తలాన మురయంబున్ మీర రావించి మా
రెలకున్ బర్వున బోవు దానిగని గౌరీ కాంత సారెంగిలా
కిల నవ్వన్ మదమొందు దంతి ముఖునిం కీర్తించి నర్తించెదన్.

**"కువలయాశ్వ చరిత్రము"** **పవరము చిననారాయణ**

శివునికి కుటుంబంలో శత్రుత్వం లేదు కాని వాహనాలకు మాత్రం అది ఉంది. శివుని వాహనం నంది. దానికి పార్వతి వాహనమైన సింహానికి వైరం. వినాయకుని వాహనం ఎలుక. శివుని భూషణాలు సర్పాలు కాఅబట్టి ఆ రెండింటికి వైరం. కుమారస్వామి వాహనం నెమిలి. దానికి శివుని భూషణాలకు వైరం. ఇదొక విచిత్రమైన కుటుంబం.

శివుడుగ్రుడు కాబట్టి ఎపుడు కోప స్వభావంగాని పార్వతి మాత్రం ఆ విధంగాకాదు నవ్వుతూ త్రుళ్లుతూ ఉండే ఉల్లాస ప్రియురాలు అందుచేత ఆమె అపుడపుడు వినాయకుని వాహనమైన ఎలుకను పరమశివుని భూషణాలైన సర్పాలు బెదిరిస్తుండగా అపుడామె కుమారస్వామి వాహనాన్ని పిలిచేది. అపుడది చూచి ఆ పాములు తలా ఒక్కదిక్కు తుర్రుమని పారిపోతుంటే అదిచూసి చేసినవారికి చేసికున్నంత" అన్నట్లు ఆమె కిలకిలా నవ్వుతూ ఉండేది. అపుడామెను చూచి వినాయకుడు ఆనందించేవాడు.

ఆ విధంగా తల్లిని చూచి ఆనందించే వినాయకుని నేను నుతిస్తున్నాను.

చ॥ తనదగు వారుణంవంబొడల దాల్చిన సొమ్మును జాతివైరవుం
కినుక ధొరంగి యొండొకటి కింకిరి పేయగ చూచి యొదలం
దనరు సుధాంశురేఖ రసధారలు చిందగ గుజ్జు బొజ్జ మె
ల్పున గదలంగ నవ్వు సురపూజ్య గణాధపు ప్రస్తుతించెదన్

**"శేషధర్మము"** **తామరపల్లి తమ్మయ్య**

తన వాహనమైన ఎలుక తాను యజ్ఞోపవీతంగా ధరించిన పాము రెండు గూడ [illegible] విడిచి ఒకదానితో ఒకటి పోరాటం చేస్తుంటే అదిచూచి తాను తలపై ధరించిన చంద్రుని అమృతధారలో [illegible] గుజ్జు బొజ్జ కదల్చుతుండగా నవ్వుచున్నట్టి వినాయకుని నేను ప్రస్తుతిస్తున్నాను.

ఏకాక్షర గణపతి, వరగణపతి, క్షిప్రప్రసాద గణపతి అనే మూడు గణపతి మూర్తులకు మాత్రమే తలపై చంద్రరేఖ ఉంటుంది. కాబట్టి ఈ పద్యంలోని గణపతిని మనం పై ముగ్గురిలో ఎవరని భావించినా ఏ భేదం రాదు.

ఈ పద్యంలో గణపతి నవ్వుతున్నట్లుగా చెప్పబడినాడు. నవరసాలలో హాస్యం రెండవది. అదిగూడ వినాయకుని వలెనె తెల్లనిది దానికి అధిదేవతగూడ వినాయకుడే. ఇక ఈ హాసంలో స్మితం, హసితం, విహసితం, అవహసితం, అపహసితం, అతిహసితం అని ఆరు భేదాలున్నవి. అవి వారి ప్రకృతులను బట్టి ప్రవర్తిల్లుతూ ఉంటవి.

వినాయకుడు దేవత కాబట్టి ఉత్తమ ప్రకృతి ఉత్తమ ప్రకృతులకు స్మితం, హసితం, విహసితం ఈ రెండూ శరీరాన్ని కదిలించేవికావు కాబట్టి ఇందులోని వినాయకుని నవ్వు విహసితం అనవలె. స్థూలప్రకృతిగలవారు నవ్వుతూ ఉంటె ధ్వని అట్టే పెద్దగా రాకపోయినా హసితానికి గూడ శరీరమంతా తొలకినట్లు కదులుతూ ఉండటం పరిపాటి కాబట్టి ఆ విధంగా శరీరం కదులుతూ ఉండగా తలపై ఉండే చంద్రుడు తొలికి అతనిలోని అమృతం చిందుతూ ఉన్నది. అంటె ఈ పద్యం చదువుతూ ఉన్నపుడా చినుకులు మనపైగూడ కొన్ని పడుతూనే ఉంటవి.

## ప్రౌఢ గణపతి

ఉ॥ అల్లిన దొండమెత్తి శివు నౌదల యేటి జలంబు వుచ్చి సం
పుల్లతబాదపీఠకము పొంతనయున్న సహస్ర నేత్రుపై
జల్లి శివార్చనా కమల సంహతి ప్రోక్షణ సేయునట్లు శో
భిల్లు గజాననుండు మద భీప్సిత సిద్ధికరుండు గావుతన్

**"విజయసేనము"** **తిక్కన**

పూజాసమయంలో దేవుని ముంతుంచిన పూజాసామగ్రిపై కలశపూజానంతరం ఆ జలం ప్రోక్షించటం పరిపాటి కనుక వినాయకుడు మెల్లగా తన తొండాన్నెత్తి శివుని తలపైనున్న గంగాజలాన్ని పీల్చి అతని పాదాల చెంతన ఉన్న ఇంద్రునిపై చల్లినాడు. అపుడాజలం శివుని పూజకై ఉంచిన కమలాలపై చల్లినట్లు కనిపించింది. అటువంటి గజాననుడు మీకు ఇష్టసిద్ధులిచ్చుగాక!

దీనిలో ఇంద్రుని సహస్ర నేత్రాలు తామర రేకులవలె ఉన్నవని ఆ కన్నులతో అతడు తామరరేకుల కాంతివలె ఉన్నాడని కవిబ్రహ్మ అద్భుతంగా భావించినాడు.

శా॥ రంగద్గండ తటీ సమగ్రమదధా రాగం ధలోభభ్రమ
ద్భృంగీ మంజుల గీతి వీనుల కతి ప్రీతిన్ గడల్కొల్పవ
ర్వాంగంబున్ పులకాంకితంబుగ కడున్ హర్షాత్ముడై యొప్పను
త్తుంగాంగున్ గజ వక్త్రు మాకు నభివక్త్రుం గా ప్రశంసించెదన్

**"మార్కండేయ పురాణము" మారన**

నిగనిగలాడే తన గండ స్థలాలనుండి ప్రసవించే మదజలానికి మరిగిన తుమ్మెదలు ఝుమ్మని మూగివాదం చేస్తుండగా అది చెవుల కింపు గొలిపి అపాద మస్తకం సర్వాంగాలలో పులకించి పోయే గణనాథుడు మాకు సుముఖుడౌగాక !

వంకర తొండంగల వినాయకుడు ప్రణవ స్వరూపుడు. తుమ్మెదనాదం ప్రణవ సదృశం. కనుక వినాయకుడు దానికి పులకించి ఆనందించటం అతనికి తగిన అవస్థ.

చ॥ అరుదుగ వామభాగ లలనా కలనా చలనాత్ముడైన యా
హరుగురుగాంచి తానును తదాకృతి యౌగతినేకదంతుడై
కరికరిణీ గుణంబుల మొగంబున దాల్చి జగంబులేలు నాం
తర కరుణా సనాథు గణనాథు మరుద్గణనాథుగొల్చెదన్

**"నరసభూపాలీయము" భట్టుమూర్తి**

శివుడర్ధనారీశ్వరుడు. ఈయన యొక్క ఎడమవైపుభాగం స్త్రీరూపం. ఏనుగులలో దంతాలు మగదానికేగాని ఆడదానికుండవు. గణపతికి ఏకదంతుడని పేరు. అతని తుండానికి ఒకవైపుండవలసిన దంతం ఉండదు. ఈ ఏకదంతంలో గూడ మతభేదం ఉంది. కొన్నిమూర్తులకు కుడివైపు దంతం ఉండదు. మరికొన్నిటికి ఎడమవైపు దంతం ఉండదు. భట్టుమూర్తి యిందులో తన కల్పనకు ఎడమవైపుగల దంతంలేని మూర్తినే స్వీకరించి ఈ అపూర్వమైన కల్పన చేసినాడు.

శివుడర్ధనారీశ్వరుడు. లోకంలో సాధారణంగా మగపిల్లలకు తండ్రిని ఆడపిల్లలకు తల్లిని అనుకరించటం అలవాటు కనుక ఈ గణపతి తండ్రిని అనుకరించటానికి తనయొక్క ఎడమవైపుగల దంతాన్ని పెరికివేసికుని ముఖంలో కరికరిణీ రూపాలు రెండూ ధరించి మరుద్గణాలకంతా అధిపతియైన గణనాథుని నేను సేవిస్తున్నాను.

మానవులు స్త్రీలు పురుషులు స్త్రీ లక్షణంగల పురుషులు పురుషలక్షణంగల స్త్రీలు నపుంసకులు మాచకమ్మలు అని ఆరు విధాలు. ఈ లక్షణాలు మనకు దేవతలలోగూడ కనిపిస్తాయి.

చంద్రుడు స్త్రీ స్వభావం గలవాడు. బుధుడు నపుంసక లక్షణం గలవాడు. గౌరి పురుషస్వభావం గల స్త్రీ. అరజ మాచకమ్మ [illegible]

[illegible] మనం గణపతిని పురుషరూపంలో పూజిస్తున్నాం కాని, నేపాలు దేశంలో స్త్రీ రూపంలో గూడ పూజిస్తారు. [illegible] అని పిలుస్తారు. [illegible] దేశాలలో స్త్రీ పురుష రూపాలు పెనవేసుకున్న అర్ధనారీశ్వర మూర్తులుగూడ ఉన్నాయి. అత్యంత రహస్యమైన యోగవత్యాన్ని తెలిపే ఆ మూర్తులను వారు బహిరంగంగా పూజించరు.

మనదేశంలో గూడ శిలాశిల్పంలో అర్ధనారీశ్వర గణపతి మూర్తి వచ్చింది. పై పద్యంలో భట్టుమూర్తి అటువంటి మూర్తినే నుతించినాడు.

శా॥ దంతాఘట్టన రాజతాచల చలద్గౌరీ స్వయం గ్రాహమున్
కంతు ద్వేషికి జేర్చ శైలజకు తద్గంగార్ఘురా శాంతిన
త్యంతా మోదము మున్ను దానిడి కుమారాగ్రేసరుండై పితృ
స్వాంతంబు ల్వేలయింప జాలు నిభరాడ్వక్త్రున్ బ్రశసించెదన్

**"వసుచరిత్రము"** **భట్టుమూర్తి**

రాయలయుగంలో వచ్చిన కావ్యాలలో మనుచరిత్ర మొదటిది. కాగా వసుచరిత్ర ఆ యుగానికి చివరిదిగా భావింపబడుతుంది. కనుక మనుచరిత్రలో బాలుడైన వినాయకుడు వసుచరిత్రనాటికి ప్రౌఢుడు కావటం సహజమే.

కాగా అందులోను ఇందులోను అతడు గజాస్యుడే. ఏనుగులకు తామతూడులు పెరకటం ఎంత యిష్టమో కొండలను కోరాటడం గూడ అంతే యిష్టం. కనుక గజబుద్ధితో ఒకనాడతడు తనయొక్క దంతాలతో కైలాసపర్వతాన్ని కుమ్మగా. అది కదిలిపోయి పార్వతి ఆ అకాల భూకంపానికి భయపడి శివుని కావలించుకున్నది.

అపుడు తల్లియొక్క ఆ సాధ్వసాన్ని పోగట్టటానికి వినాయకుడు శివుని తలపైనున్న గంగనంతా పీల్చి వెదజల్లినాడు. అపుడదిచూచి పార్వతి గంగ తనకు సవతి కాబట్టి తన కుమారునితో ఆమెకు కలిగిన పాట్లు చూచి తగిన శాస్తి జరిగిందని భయాన్ని మరిచి ఆనందించింది. అంత గౌరి యొక్క సపత్నీ పరాభవ జనితమైన ఆనందానికి శివుడు గూడ స్త్రీ హృదయం ఎరిగి ఆనందించినాడు. కనుక ఆ విధంగా మొదట తల్లికి ఆ తరువాత తండ్రికి ఆనందం కలిగించిన కుమారాగ్రేసరుడు అనగా పెద్దకొడుకైన వినాయకుని నేను పొగడుతున్నాను.

ఆంధ్రసాహిత్యంలో భట్టుమూర్తి ప్రభావం అనేకులపై ఉంది. మా తాలూకాలోని అటువంటి ఒక కవిగారిని చూడండి.

శా॥ ప్రోత్తుంగాగ్రితదంత ఘట్టనలచే భూతేశ సీతాద్రి ను
ద్వృత్తిన్ కంపమునొంద జేసి దివి విస్తీర్ణోత్త మాంగాంబువున్
చెత్తాచెల్లయి రాల తత్కణములన్ చేద్రావి గౌరీమనం
బాత్తా నందము సేయుచున్న గజవక్త్రా ధీశు నర్చించెదన్

**"సప్తాహ మహాత్యము"** **బంగారు నరసింహాకవి**

ఈ కవి అచ్చంపేట తాలూకాలోని ఉప్పునూతల నివాసి కొండారెడ్డిపల్లి రాఘవశాస్త్రిగారి ఆస్థానంలో ఉండి సప్తాహ మహాత్య్మం అనే కావ్యాన్ని రచించినాడు. ఈయన స్వతంత్ర కల్పనాదక్షుడైనా భట్టుమూర్తిపైగల అభిమానంచేత ఈ పద్యంలో అతనిని అనుకరించినాడు.

చ॥ నిజభజనాభి యోజన వినీత సుధీజన సూక్త సత్కృతీ
ప్రజముల మాధురీ గుణమవశ్యము నిల్పు నిరీక్ష నిక్షుసా
ర జలధి మధ్య వాసతను రంజిలు బాహు దశాంచితున్ మహా
గజముఖు భక్తి మెఱ్ఱుముఖు గణ్యగణ ప్రముఖున్ భజించెదన్

"ముకుంద విలాసము" కాణాదం పెద్దన

వినాయక మూర్తులలో విఘ్న గణపతి లక్ష్మీగణపతి మహాగణపతి అనే మూడు రూపాలు దశభుజాలు గలవి. ఇందులో వర్ణించబడినవాడు. ఇక్షు సముద్ర మధ్యంలో ఉన్నట్లు చెప్పబడింది. ఆ విషయాన్ని కవి యిట్లా ఊహించినాడు.

తననెల్లప్పుడూ సేవించే పండితులైన భక్తులయొక్క సూక్తులయొక్క వాక్కులలో ఎల్లప్పుడు చెరుకురసంవంటి తీపిని నిలుపటానికై ఇక్షుసముద్ర మధ్యంలో నిలిచిన గణపతిని నాకు సుముఖుడయ్యేందుకు భజిస్తున్నాను.

చ॥ గరికయు బిల్వజన్నిదము కొంజర మౌలపనంబు జూచి శం
కరశర జన్మశైల సుత కాండములున్ వెసమెక్కరాగనే
నరయగ పాకహస్తుడ వినాయకుడన్ శరభావ తార నో
దరుడ నటంచు వారల నదల్చిన దేవుని ప్రస్తుతించెదన్.

"చాటువు"

ఈ పద్యంలో వినాయకుడు దబాయింపుల మొనగాడుగా వర్ణింపబడినాడు. ఎట్లాగో చూడండి. అతడు ఏనుగు ముఖం పొపజందెం కలిగి గరికను ధరించిన వాడు కనుక వానిని చూచి పార్వతి వాహనమైన సింహం, కుమారుని వాహనమైన నెమలి, శివుని వాహనమైన వృషభం వానిని భక్షించటానికి వెళ్లినవి. అప్పుడు సింహాన్ని చూచి పిడుపానికి శరభానికి వైరం హిరణ్యకశిపుని వధించిన విమ్మట నృసింహమూర్తి మదించి వుండగా శివుడు శరభ రూపం ధరించి అతనిని వధించినట్లు ఒక శివపురాణకథ కలదు - దానిలో నేనెవరిననుకున్నావు శరభావతార సోదరుడనని - కుమారస్వామి వాహనమైన నెమలి నెమళ్లకు పాము ఆహారం కనుక అతని జందెమైన పామును తినటానికి రాగా నేనెవరిననుకున్నావు వినాయకుడను. అనగా పక్షి కాబట్టి పక్షుల రాజైన గరుత్మంతుడను అనగా

నాయాజ్ఞ నీకు మీరరానిదని - వినాయకుడు గరిక పూజకు తృప్తిపడేవాడు కనుక అతని చేతిలోని గరికను చూసి శివుని వాహనమైన వృషభం దానిని తినటానికి రాగా నేను పాశహస్తుడను - అనగా చేతిలో త్రాడుంది. దానితో నిన్ను కట్టివేస్తాను. అని వానిని అదిలించి ఆత్మరక్షణ చేసుకున్నాడు అటువంటి ఆ దేవుని నేను నుతిస్తున్నాను.

ఈ పద్యంలో విఘ్నగణపతి వర్ణింపబడినాడు. రూపధ్యాన రత్నావళి ప్రకారం గరికను విఘ్నరాజ గణపతియే ధరించినాడు.

మ॥ కలుషే భావళినాపనంకుళము విఘ్నక్ష్మాధరశ్రేణి వ
క్కలు గావింపగ ప్రస్ఫురత్కులికమున్ గర్వ ప్రమత్తారి వీ
రుల బంధింపగ పాశమున్నత మనోరుగ్రేణువుల్ మాన్ప బు
ష్కల దానాంబువులూను వేల్పడుచు మత్కావ్యాంతరాయచ్ఛటల్

**"ఉత్తర రామాయణము"** **కంకంటి పాకరాజు**

వినాయకుని ఆయుధాలలో అంకుశం, కులిశం, పాశం అనేవి ముఖ్యమైనవి. అవే ఎందుకు అనేదానికి కవి ఈ పద్యంలో సమాధానం చెబుతాడు.

మానవులను ఆశ్రయించి ఉండే పాపాలు అనేవి ఏనుగులు. ఏనుగులు నల్లనివి. అంతేగాక ప్రాణికోటిలోని కెల్ల పెద్దవి. మానవుని పాపాలుగూడ అంతే. అవి తమోగుణ స్వరూపమైనవి. అతని కర్మలన్నిటిలో అవే పెద్దవి. కనుక ఆ ఏనుగులనదుపులో పెట్టటానికి అంకుశం మనం చేసే పనులకు కలిగే ఆటంకాలు అనేవి కొండలు. అంటె అవి అట్లా కదలించరానివి. కాబట్టి వాటిని పగులగొట్టే అందుకు వజ్రాయుధం మానవులలో ఉండే అరిషడ్వర్గాలు అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. అనేవి శత్రువర్గం కాబట్టి ఆ శత్రువులను కట్టివేయటానికి పాశం, మనోవ్యాధులు అనేవి ధూళి రేణువులు కాబట్టి అదుపులోనుంచటానికి చాలినంత దానజలం అనగా మదజలం ధరించిన దైవమైన వినాయకుడు మీ యొక్క పనులకు కలిగే అంతరాయాలు తొలగించుగాక !

మ॥ అమృతాంభోనిధి మంధనిర్మథన కార్య విఘ్నసేవార్థమై
యదురుల్ దైత్యులు సేంబ పూజగొని యయ్యం బోధి సంభూతి యౌ
రమణీన్ లక్ష్మి నిజాంక పీఠికడుగారా మొప్ప జేకొన్న వే
ల్పు మ్మాడా నీపతి కూర్మి పట్టి గణపాలున్ గొల్తు వాక్సిద్ధికిన్

**"సూతసంహిత"** **పట్టమెట్ట సోమనాథకవి.**

సముద్ర మధన సందర్భంలో ఏ ఆటంకం కలుగకుండా దేవతలచేత దానవులచేత పూజింపబడి అనంతరం ఆ సముద్రంలో జనియించిన లక్ష్మీదేవిని గ్రహించి తనతొడపై కూర్చుండబెట్టుకొనిన శివుని కుమారుడైన గణపతిని నేను వాక్సిద్ధికై సేవిస్తున్నాను.

మ॥ కలుషధ్వాంత వికర్త నుండగుచు విఘ్నస్వామియై సర్వ మం
గళ సర్వజ్ఞుడు గారవింపగ దివౌకశ్రేణికా పూజ్యుడై
అలరున్ సిద్ధిగణేశ్వరుండెపుడు నుద్యత్కార్య సంసిద్ధి బు
ద్ధిల సత్ప్రౌఢిమ మిచ్చి వెంకట ధరిత్రీనాధు రక్షించుచున్

"రెట్టమత శాస్త్రము" అయ్యలుడు భాస్కరుడు

దీనిలోని సిద్ధిగణేశ్వరుడు వర్ణింపబడినాడు. గణపతికి బ్రహ్మచారిగానే ప్రాముఖ్యమున్నా అతడు వివాహితుడుగా కూడ కొన్ని పురాణాలలో చెప్పబడినాడు. విశ్వరూప ప్రజాపతి కుమార్తెలైన సిద్ధి బుద్ధి అనే యువతులను వివాహమాడినట్లు వారివలన క్షేముడ, లాభుడు అనే సంతానం కలిగినట్లు శివపురాణం చెబుతుంది.

సిద్ధిగణపతి పాపములనే చీకటికి సూర్యుడై శివపార్వతులు గారవించుచుండగా దేవతలందరికి పూజ్యుడై యొప్పుచుండును. అటువంటి ఆ సిద్ధి వినాయకుడు మెచ్చి మీకు సిద్ధి బుద్ధులను యిచ్చుగాక.

సిద్ధి వినాయకాలయం యిపుడు భీమానది తీరంలోని సిద్ధిటేక్‌లో ఉంది. హైదరాబాదులోగూడ ఉంది.

ఉ॥ సిద్ధియు బుద్ధియున్ ప్రణయ శీధు తరంగిణి సూచగా శుభా
వర్ధ జయప్రవర్తనుడునై వెలుగొందెడు భక్తరక్ష స
న్నద్ధుని బొజ్జ దేవర ననారతమున్ భజియింతు సాహితీ
శుద్ధ కవిత్వ సిద్ధికి యశో విసరద్రస రాజ్యసిద్ధికిన్.

"కర్ణుడు" కలుగొట్ల విజయాత్రేయ

సిద్ధి బుద్ధి అనే భార్యలిద్దరు తనను ప్రేమ అనే సురాసముద్ర తరంగాలలో మాపుతూ ఉండగా శుభాలిస్తు జయం కలిగించేవాడై ప్రకాశిస్తు భక్తరక్షణకు సన్నద్ధుడై నిలిచిన బొజ్జ దేవుడు నేనెల్లప్పుడు అచ్చమైన కవిత్వానికి కీర్తి అనే రసరాజ్య సిద్ధికి సేవిస్తున్నాను.

ఉత్తర భారతంలో శివుని కుమారులైన గణపతి కుమారస్వాములిద్దరూ బ్రహ్మచారులుగానే ప్రసిద్ధి. దక్షిణ భారతంలో మాత్రం ఈ సోదరులిద్దరు బ్రహ్మచారులుగాను గృహస్థులుగా ఉన్నారు. గణపతి విశ్వరూప ప్రజాపతి పుత్రికలైన సిద్ధి, బుద్ధి అనే యిద్దరిని వివాహమాడినాడు. కుమారస్వామి దేవసేన శ్రీవల్లి అనే యిద్దరు భార్యలను చేపట్టినాడు.

ఇందులో సిద్ధి బుద్ధి సమేతుడైన గణపతి వర్ణింపబడినాడు. ఇతనిని లక్ష్మీగణపతి అంటారు. ఈ గణపతికి రెండువైపులా రెండు తొడలపై దేవేరులు కూర్చుని ఉంటారు.

ఉ॥ తొండము మీదికెత్తుకొని దోర్యుగళంబున తాళగించుచున్
గండమదాంబుధారలకు గ్రమ్మెడు తుమ్మెదలొత్తు కారుగ
గొండలతేనీ కూర్మి సుతకుంబియమందగనాడు చున్నవే
దండముఖుండు నవ్య కవితారస సూక్తులు మాకునీవుతన్.

**"పద్మపురాణము"** **మడికి సింగన**

తనయొక్క కణతలనుండి కారే మదజలానికి దట్టంగా మూగిన తుమ్మెదలు నల్లని మేఘంవలె కనిపిస్తుండగా తొండాన్ని పైకెత్తుకొని చేతులతో తాళంవేస్తు పార్వతీదేవికి సంతోషం కలిగేటట్లుగా ఆడుతున్న గణపతి మాకు చక్కగా రసాలుట్టిపడేటట్లుగా క్రొత్తకొత్తనైన కవితాసూక్తులిచ్చుగాక !

## అద్భుత గణపతి

శా॥ గీర్వాణాచల సానువాత్మరదన క్రీడాహతంబైన న
య్యుర్వీరంధ్రమునం దనంత ఫణరత్నోద్య త్ప్రభల్పద్విదృ
ష్పర్వంబై పాదిగట్టి పేర్చిన మదిం గంజంబయాంచున్ కన
ద్గర్వోన్మీలిత నేత్రుడై మ్రొయు వేదండాననుం గొల్చెదన్

**"విజయసేనము"** **తిక్కన**

మేరువును తనయొక్క కొరలతో గొరాటునపుడు ఆ దెబ్బచే రంధ్రముపడ ఆ రంధ్రములో నుండి అనంతుని యొక్క పడలగల పైని గల రత్నాకాంతులు వ్యాపించి కన్నుల పండువుగా దొంతరలు గట్టగా అదిచూచి తామరలని గర్వంతో నిమీలితాక్షుడై ధ్వనిచేయు గజముఖుని నేను సేవిస్తున్నాను.

శ్రీలంకలోని "పొలొన్నరువ"లో గల శివాలయంలో అద్భుత గణపతి మూర్తి ఉంది.

చ॥ పృథివిని భూధరావలిగ భీరము సాగర సప్తకంబు త
త్ప్రథిత నిబంధనంబు వియదంతరమెల్ల కటిప్రదేశ మా
పృథుతర లోకసంఘములు భీమపి చండ మజాండ మాలికా
గ్రథనము నీదుమస్తమని గాంతురు సిద్ధి వినాయకాధిపా !

**"శివరాత్రి మహాత్మ్యము"** **శ్రీనాథుడు**

ఈ పద్యంలో వినాయకుని విశ్వరూపం వర్ణింపబడింది.

ఓ సిద్ధి వినాయకా ! యోగులు పర్వతములు నీయొక్క ఎత్తు. సముద్రాలు నీయొక్క మూత్రాశయం, ఆకాశము నీ యొక్క కటి ప్రదేశం చతుర్దశ భువనాలు నీయొక్క బొజ్జ, బ్రహ్మాండ మాలికలు నీయొక్క శిరస్సుని భావించి నిన్ను దర్శిస్తుంటారు. అట్టి నీకు నమస్కారం.

వినాయకుని విశ్వరూపం గణేశగీతలో అష్టమాధ్యాయంలో ఉంది. సిద్ధి వినాయకాలయం ఇపుడు ఖైరతాబాదులో ఉంది.

ఉ॥ విఘ్నము లెల్లబాపి పృథివిన్ భవనీరధి పేర్మి గుల్ఫ సం
దఘ్నము చేసి నిల్తురు చితస్థితి నెవ్వరి భృత్యులట్టి దుః
ఖఘ్నుండు షణ్ముఖ ప్రథమ గర్భుడు భద్ర గజాస్యుడైన యా
విఘ్న విభుండు మత్కృతికి వేడుక తోడ సహాయుడయ్యెడున్

**"భోజరాజీయము"** **అనంతామాత్యుడు**

ఏ దేవుని యొక్క భక్తులు దుఃఖ సముద్రాన్ని పిక్కల బంటిగా చేసికొని దాటుతుంటారో అటువంటి దుఃఖాంతకుడు, కుమారస్వామి కంటె మొదట పుట్టినవాడు అయినటువంటి భద్రగజముఖుడైన వినాయకుడు వేడుకచేత మీకెపుడు సహాయుడగుగాక!

ఈ పద్యంలో భద్రగజాస్యుడు అని విశేషించి కవి వినాయకుని భద్రాలు అనగా శుభాలిచ్చే వానిగా పూజించినాడు. అతడు భద్రగజాస్యుడు కాబట్టే తన భక్తులను దుఃఖసాగరం భద్రంగా దాటిస్తాడు.

క॥ నీదెస తమ చిత్తములిడి, యేదెసలకు బోకకడతు రెరుక గలుగువా
రాదూడ యడుగు క్రియనీ, పాదంబును నావకతనభవ సాగరమున్
భా. ద -1-12

తమ చిత్రాలన్నీ [illegible] - నారాయణునిపై - ఉంచినవారు నీ పాదాలనే నావసహాయంతో భవసాగరాన్ని [illegible] దాటినంత సులభంగా దాటుతారు అని భాగవతంలో చెప్పబడింది. [illegible] వినాయకుని భక్తులకు దుఃఖసముద్రం పిక్కలబంటి అని చెప్పబడింది. [illegible] దుఃఖ సముద్రంగా తరింపటం ఒక లెక్కలోనిది కాదని తాత్పర్యం.

శా॥ క్రీడాలోల తదంత కోరక శిఖంగీలించి భూ చక్రమున్
గ్రోడగ్రామణి నుండి యెత్తి ఫణులక్షుద్రాసు మోదంబునన్
జూడాభోగము లెత్తి చూడదగివేండాల రాణ్మండలిన్
క్రీడంబొందగ జేయు దంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్

**"బాలభారతము"** **కాకుమాని గంగాధరుడు**

ఆటలో తనదంతం యొక్క కొనను తగిలించుకొని భూచక్రాన్ని వరాహస్వామికంటె గొప్పగా పైకెత్తి పాతాళలోకంలోని సర్పాలన్ని మహాశ్చర్యంతో పడుగలెత్తి చూస్తుండగా దిగ్గజాలను సిగ్గుపడ చేసిన గజముఖుని ఆటంకాలు తొలగే అందుకు నేను సేవిస్తున్నాను.

విష్ణువు వరాహరూపంలో భూమిని తన కోరపై ఎత్తినాడు వినాయకుడు గూడ "శుక్లాంబరధరం విష్ణుం" అని విష్ణురూపంలో చెప్పబడుతాడు. కాబట్టి వరాహంకంటె ఏనుగు గొప్పది. కాబట్టి ఆనాటి వరాహస్వామి నాటికంటె యిపుడింకా అవలీలగా భూచక్రాన్నెత్తినాడని ఈ పద్యం యొక్క తాత్పర్యం.

మ॥ ననుమన్నింపుము నీకు మామయగు మైనాకుండు సాకాధి నా
ధుని మ్రోలంబడు నంచు పార్వతి వియద్ధాత్కారమున్ మాన్చి నం
దనతుండంబున బీల్చియున్న జలధిన్ ధాగ్రమ్మనం గ్రుమ్మరిం
చిన శుండాల ముఖుడు మామకకృతి శ్రీకిచ్చు నిర్విఘ్నతన్

**"కవికర్ణరసాయనము"** **సంకుసాల నృసింహాకవి**

ఇంద్రునికి జడిసి పార్వతీదేవి యొక్క అన్నయైన మైనాకుడు అనే పర్వతరాజు సముద్రంలో దాగినట్టు పురాణ ప్రసిద్ధం. ఒకనాడు కరిముఖుడైన గణపతి ఆ సముద్రుని దగ్గర కేగి దానిలోని నీటినంతా పైకి చిమ్మటానికి తొండంతో పీల్చినాడు. అప్పుడది చూచి పార్వతి కొడుకుతో నాయనా ! నామాట మన్నించరా ! నీవట్లా సముద్రంలోని నీటినంతా పీల్చితే మీ మామయైన మైనాకుడింద్రుని కండ్లముందుపడి రెక్కలు తెగిన పక్షియై అల్లాడిపోతాడనగా తల్లియొక్క ఆ మాటను మన్నించి తాను పీల్చిన నీటినంతా మళ్ళీ వదలినాడు.

కనుక అటువంటి వినయపరుడైన గజముఖుడు మన యొక్క ఆటంకములన్నీ తొలగించు గాక [illegible]

ఏనుగులకు నీళ్లను చూస్తె చెల్లాటం కనుక ఇందులో వినాయకునిలోని సహజస్వభావంతోపాటు తల్లిమాటల యెడల భక్తి వినయాలు గూడ చిత్రించబడినవి.

శా॥ లీలాకేళికృతి స్వకందు కములై లెక్కింపగా రానియు
ద్వేలాత్కృశవణ ద్వయ ప్రచలనా విర్భూత పాలోత్థ దో
ళాళుల్ భూమినభోంతరాళమున నృత్యంబాడ నర్తించు గౌ
రీ లీలావతి పట్టి మత్కృతికి నిర్విఘ్నత్వ మిచ్చుస్ కృపన్

"హంసవింశతి" అయ్యలరాజు నారాయణామాత్యుడు

దీనిల్లో వాట్యగణపతి వర్ణింపబడినాడు. తనయొక్క చేటలవంటి చెవుల కదలిక వలన పుట్టిన గాలికి బ్రహ్మాండంలోని గోళాలన్నీ ఆటలోని బంతులవలె తేలియాడుతూ ఉండగా నాట్యమాడుతున్న గౌరీకుమారుడను గణపతి మన యొక్క పనులకు ఆటంకములు తొలగించుగాక.

ఏనుగుకు చెవులు ఎప్పుడూ కదులుతూ ఉండటం అలవాటు. అవి ఆ విధంగా కదులుతూ ఉండగా దానినుండి విసనకర్రలు వీచినట్లు గాలిగూడ పుడుతుంది. కాబట్టి ఆ విధంగా పుట్టిగాలివల్ల బ్రహ్మాండ గోళాలన్ని ఇవుడు మన పిల్లలు ఊదుకునే ఊపిరి బుగ్గలవలె గాలిలో ఆడుతూ ఉన్నవనగా ఈ గణపతి మామూలువాడై ఉండడు. అతడొక అద్భుతమూర్తి. అటువంటి అద్భుతమూర్తికి తనయొక్క చేటచెవుల గాలిలో భక్తుల యొక్క ఆటంకాలెగుర గొట్టడం ఒక లెక్కలోనిది కాదని ఇందులోని సూచన.

చ॥ పితృగరదున్ హరింతునని బొగ్గల సాగరు జీవనంబు ను
[illegible] పితామహు నయ్యతుగేహమై నది
తృతియగుసాగరుండన నతండ గరుండవునంచు తండ్రి త
ద్ధతి వలదన్న మానిన గజాస్యుని విఘ్నముకై భజింపెదన్.

"యాదవ భారతీయము" [illegible]

గరశబ్దానికి విషం, జలం అని రెండర్థాలున్నవి కాబట్టి యీ పద్యంలో గర శబ్దంపై [illegible]

సముద్ర మథన సందర్భంలో అందులో విషం - అమృతం రెండూ పుట్టినా ఆ రెండు [illegible] అందులో స్వతస్సిద్ధంగా లేవు - తర్వాతగా చేయగా వాసుకి కక్కిన విషం అంతా ఒకచోటికి [illegible] అందులో హాలాహలం పుట్టింది. ఇక అమృతం అంతవరకు స్వర్గంలో ఉన్నదే, దుర్వాసోముని శాపంతో సముద్రంలోపడి పోయింది. దానికొరకే దేవదానవులు మళ్ళీ సముద్రాన్ని మథించవలసి వచ్చింది. అప్పుడు మొదట విషం పుట్టగా దాన్ని శివుడు హరించినాడు.

ఇది తెలుసు కాబట్టి [illegible] విషమిచ్చిన ఈ దుష్ట [illegible] లేకుండా చేస్తానని సముద్రుడు భయపడిపోయేటట్లుగా తన తొండంతో సముద్రంలోని నీరంతా పీల్చివేయగా తండ్రియై శివుడది చూచి వాయవా సముద్రుడంటే ఈ లోకాలన్ని పుట్టించే బ్రహ్మ[illegible]

తండ్రియైన నారాయణునికి నివాసస్థానం. అంతేగాక అతడు నదీ కన్యలకందరికి పతిదేవుడు కనుక అతనికి హాని చేయటంకూడదనియనగా తండ్రిమాట విని తాను తలపెట్టిన పనిని మానినట్టి వినయపరుడైన వినాయకుని నేను ఆటంకాలన్ని తొలచేందుకు సేవిస్తున్నాను.

ఉ॥ అంబరకేశ ముఖ్యవిబుధావళి గర్భము లందడంగ వ
య్యంబు జసంభవాండ నివహమ్మలటం చని వానినుంచ దో
రంబుగ జేయు రీతి నుదరంబుసు బెంచిన గుజ్జువేల్పు ని
త్యంబుగ మామ కీనకృతి ధారుణిలోన జెలంగ జేయుతన్

**"ఆంధ్రభాషార్ణవము"** **కోటి వెంకనార్యుడు**

మనకు కనిపించే ఈ విశ్వం అనంతమయింది. దీనిలో అనంతకోటి బ్రహ్మాండాలున్నవని హిందూ పురాణాలు చెబుతవి. బ్రహ్మాండం అంటె ఒక సూర్యునికి లోబడిన ప్రదేశం.

ఇపుడు మనముండే ఈ బ్రహ్మాండంపై పంచభూతాలు ఒకదానిపై ఒకటి రెండంతలు ఏడు పొరలుగా ఏర్పడి ఉన్నవని మన పురాణాలు చెబుతున్నవి. ఈ ఏడు పొరలనే మహమ్మదీయులు ఏడు ఆకాశాలంటున్నారు.

ఇక ప్రతి బ్రహ్మాండంలోను సూర్యచంద్ర నక్షత్రాలు, లోకాలు ఉన్నవి. ప్రస్తుతం మన బ్రహ్మాండంలో శాస్త్రవేత్తలు సూర్యాది నవగ్రహాలను, అశ్విన్యాది యిరువదేడు నక్షత్రాలను, మేషాదిద్వాదశరాసులను, వీనితో పాటు ఊర్ధ్వలోక సప్తకం, అధో లోక సప్తకం అని పదునాల్గు లోకాలు గుర్తించినారు.

ఈ లోకాలను అష్టదిక్పాలకులు పాలిస్తున్నారు. త్రిమూర్తులు సృష్టి స్థితి లయాలు నిర్వహిస్తున్నారు. ఇది అన్ని బ్రహ్మాండాలకు సమానమే అయినా వానివానిపై ఉండే పొరల్లోను లోపలి లోకాలలోను అన్ని సమానంగాగాక సంఖ్యా భేదాలతో ఉన్నట్టు తెలుస్తుంది.

ఈ అనంతమైన బ్రహ్మాండాలన్ని ఆ పరమేశ్వరుని కుక్షిలో ఇమిడి ఉన్నవని మన పురాణ వాఙ్మయం చెబుతుంది. కనుక ఈ బ్రహ్మాండాలన్ని శివుడు మొదలైన ఏ దేవతల బొజ్జలోను ఇముడవని తలచి వానిని ధరించటానికి తన బొజ్జను పెద్దగా పెంచిన లంబోదరుడైన వినాయకుడు మీ పనులకెప్పుడూ జయం కలిగించుగాక !

ఉ॥ నిక్కిన వేడ్క తొండమున నీరధి తోయము బీల్చి చివ్వ నన్
మక్కువతోడ చిమ్మగ నమర్త్యులు భీతినిగాంచి యయ్యు రో
యెక్కడి నీరమేడ జగమేడ చరాచో కోటి నిల్పవే
గ్రక్కున నన్న సంతసిలు గంధగిజాస్య దొసంగు భద్రముల్

**"కంబరామాయణం"** **పూతలపట్టు శ్రీరాములురెడ్డి**

ఏనుగులకు నీటిని పీల్చి పైకి చిమ్మటం అలవాటు అది ఇందులో అద్భుత రసావిష్కారంగా చూపబడింది.

ఉత్సాహంగా పొంది సముద్ర జలాన్నంతా తొండంతో పీల్చి దివ్వని పైకి చిమ్మగా అదిచూచి దేవతలంతా భయపడి తండ్రీ ఈ సముద్ర జలమేడ ! ఈ ప్రపంచమేడ (అనగా అది మూడుపాళ్ళు ఇది ఒక్కపాలు గనుక సముద్ర జలమే నేలపై వ్యాపిస్తే భూమి చిన్న పెళ్లవలె కరిగిపోతుంది కాబట్టి ఈ చరాచర జీవకోటిని రక్షించమని ప్రార్థించగా సంతసించి ఆ ఉద్యమం మానిన గణపతి భద్రం యిచ్చుగాక !

దీనిలో గణపతి విఘ్నకారి విఘ్ననివారకుడు రెండు తానే యైనాడు.

శా॥ శ్రీలక్ష్మీ సహజాతు శీతకిరణున్ క్షీరాబ్ధి సంభూతునిన్
చాలన్ ఘోరముగా శపించితి వెటుల్ సాధ్యంబగున్ జూడ కుం
టాలోచింపుము శాపమాపుమని యింద్రాదుల్ కదున్ వేడగా
మేలుంజేయు కృపాప్రసన్న వదనున్ విఘ్నేశ్వరున్ గొల్చెదన్

**"శ్రీనివాస కళ్యాణము"** **చెళ్ళపిళ్ళ బంగారేశ్వర శర్మ**

వినాయకుడు చంద్రునికి శాపంపెట్టిన కథ పురాణ ప్రసిద్ధం ఒకనాడతడు కుడుములు కడుపునిండా తిని భుక్తాయానంతో లేచిలేవలేక నడుస్తుండగా చంద్రుడు చూచి నవ్వగా వినాయకుడందుకు కోపించి నేటినుండి నీ మొగం చూచినవారు అపనిందలు పడి నవ్వులపాలౌదురుగాక అని శపించినాడు.

అపుడు దేవతలంతా గణపతిని జేరి స్వామి ! చంద్రుడు పాలకడలిలో పుట్టినాడు. లక్ష్మీదేవికి అన్నగారు. లోకానికి చల్లని కాంతినిస్తుంటాడు. అటువంటి వానిని నీవింత ఘోరంగా శపించినావు. లోకానికతనిని చూడకుండా బ్రతకటం సాధ్యంకాదు. కనుక ఇచ్చిన శాపాన్నేవిధంగానైనా మళ్ళించమని వేడగా దాన్ని కేవలం తాను పుట్టిన దినంనాటికే వినాయకచవితి నాటికే పరిమితం చేసి అదికూడ ఆనాడు తనను పూజించిన వారికి తన వ్రతం చేసిన వారికి వర్తించదని నియమించినాడు. కనుక అటువంటి దయార్ద్రహృదయుడైన ప్రసన్నమైన ముఖం కల వినాయకుని నేను సేవిస్తున్నాను.

ఇందులో కవి కృపాప్రసన్నవదనున్ అని గణపతిని విశేషించటం సంఘటనకు తగిన పర్యాయం. గణపతి ప్రసన్న వదనుడు. [illegible]

[illegible]

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే
అని పూజాసమయాలలో అతనిని ధ్యానిస్తుంటారు.

ఉ॥ బ్రహ్మకు బ్రహ్మ చర్యమున భారతి బంధుతలోటు నాటె నా
జిహ్మగ శాయికిన్ నటులచేద్పడె వంచన వంచనబ్బలిన్
జిహ్మగ భూషణుండు పోలిచెన్ కుహనా వటుకా ఖ్యగందునన్
జిహ్మత లేక నీ వటుత చెల్లు గణేశ్వర సాటిలేకిలన్

**"విక్రమాంకదేవ చరిత్రము"** **కాశీవిశ్వనాధరావు**

వటు శబ్దానికి పొట్టివాడు బ్రహ్మచారి అని రెండర్థాలున్నవి. గణేశుడు వటువు అనగా పొట్టివాడు మరియు బ్రహ్మచారి అందువల్ల ఆ పేరు అతనికే సార్థకంగాని మరెవరికి సార్థకంలేదు. ఎట్లనగా సరస్వతీ కరగ్రహణంలో బ్రహ్మకు బ్రహ్మచర్యం యొక్క లోటేర్పడింది. విష్ణువు బలిని వంచించటానికి వటువు అనగా పొట్టివాడైనాడుగాని త్రివిక్రమత్వంలో అతని వటుత్వానికి భంగం కలిగింది.

శివుడు పార్వతిని పరీక్షించటానికి కుహనా కటువు అనగా మాయా బ్రహ్మచారియైనాడు. కాని నిజమైన వటువుకాదు. ఈ విధంగా త్రిమూర్తులకెవ్వరికి ఈ వటుత్వం సార్థకం కాలేదు. కాని వినాయకుడా విధంగా కాదు. కనుక వటువనే పేరు అతనికొక్కనికే సార్థకంగా నిలిచింది.

అంతేకాక అతడు ఎలాగూ శివుని కుమారుడే కనుక అతనిలో తక్కిన ఇద్దరిలో లేని విశేషాలు కూడా నెలకొని త్రిమూర్తుల కంటె గొప్పవాడుగా ఇందులో మనకు కనిపిస్తాడు. అటువంటి గణపతి మనకు శుభాలిచ్చుగాక !

## హాస్య గణపతి

ఉ॥ తారకజిచ్ఛి ఖండి శివుతాండవ మాడ నతండు మర్ధ లో
దారరవంబు మేఘనినదంబని చేరిన జూచి నాసికా
ద్వార బిలంబు జన్ని దపు వ్యాళము చొచ్చిన దొండమెత్త ఘీం
కారము సేసి నవ్వు వెనకయ్య కృతీశ్వరు మన్చు గావుతన్

**"అరుణాచల పురాణము"** **పెదపాటి సోమయ్య**

శివుడు తాండవమాడుతుండగా వినాయకుడు మద్దెల మ్రోగిస్తున్నాడు. ఆ ధ్వని ధణధణమని ఉరుమువలె ఉండగా అది విని ఉరుము భ్రమసి నెమిళ్లకు ఉరుము చాలా ఇష్టం కాబట్టి కుమారస్వామి యొక్క నెమిలి అక్కడికి ఉరికి వచ్చింది. అదిచూచి వినాయకుని యజ్ఞోపవీతమైన పాము భయపడి చరాచరా వినాయకుని యొక్క తొండం రంధ్రంలో దూరింది. దానితో అతడు తొండమెత్తి పెద్దగా ఘీంకారంచేసి ఆ తర్వాత అనూహ్యంగా జరిగిన ఆ సంఘటనకు నవ్వుకున్నాడు. అటువంటి వినాయకుడు మనలను కాపాడుగాక !

అక్కడ మంచి ఆనంద సమయంలో రసభంగం జరిగి అనంతరం అది హాస్యంగా పర్యవసించింది. అనగా కవి దీనిలో శృంగారం భీభత్సం అనే రెండు పరస్పర వ్యతిరేకమైన రసాలను ప్రదర్శించి ఆ రెండింటిని వినాయకుడు హాస్యానికధి దేవతగా బట్టి అతినేర్పుగా హాస్యంతో ఉపసంహరించినాడు.

(ఒక్కొక్కప్పుడు మన జీవితంలో గూడ మంచి రసకందాయంలో అనుకోకుండా దానికాటంకం కలిగే ఏదో సంఘటన జరిగి అది కూడ ఇట్లాగే హాస్యంతో ఉపశాంతి పొందుతూనే ఉంటుంది.)

# హేరంబ గణపతి

శా॥ జేజేయంచు భజింతు నిష్ఫల సంసిద్ధుల్ మదింగోరి ని
ర్వ్యాజాపార కృపావలంబు నికట ప్రస్యంద దానాబునిన్
పూజాతత్పర దేవదానవ కదంబున్ బాలకేళీ కళా
రాజత్కౌతుక రంజి తోరగ ఘనప్రాలంబుహేరంబు నిన్

**"శృంగార నైషధము"** **[illegible] శ్రీనాథుడు**

హే అనగా దీనులు రంబుడనగా వారిని రక్షించే వాడని అర్థం. గణపతి మూర్తులలో హేరంబమూర్తికి ఒక ప్రత్యేకత ఉంది. ఈ మూర్తి లక్షణాలు వినాయకుని వివిధ రూపాలలో చెప్పబడినవి, చూ. 11వది. పేరు తప్ప ఆ మూర్తి లక్షణాలేవి ఈ పద్యంలో కనిపించవు. ఈ మూర్తిని నేపాలు దేశీయులెక్కువగా ఆరాధిస్తారు.

ఈ పద్యంలో బాలహేరంబుడు స్తుతింపబడినాడు. తల్లిదండ్రులు తమ పిల్లలకు మెడలో దండలు వేసినపుడు పిల్లలకు వానిని పట్టుకొని ఆడుకోవటం అలవాటు. అది యిందులో చూపబడింది.

నేను అవ్యాజమైన దయగలవాడు. దేవతలు మరియు దానవులతో పూజింపబడుతుండేవాడు తన గండస్థలాలనుండి మదజలం కారుతూ ఉండగా పిల్లతనపు చేష్టతో తనమెడలో పొడవుగా వ్రేలాడుతున్న సర్పహారంతో ఆడుకుంటున్న గణపతిని విఘ్ననివారణ కొరకు జయజయ నినాదాలతో సేవిస్తున్నాను.

ఈ పద్యం అంత్యప్రాసతో కూర్పబడింది.

మ॥ తొలుమ్రొక్కుల్ గొను వేల్పు గొల్తు శశి భృత్కోటీరు, కోటీరట
త్కల భూషాంకిత గాత్రు, గాత్ర మర సంఘస్తోత్ర వేశా నిర
ర్గళ ధారాళ కట ప్రధాన తటి నీరంగ ద్విరేఫాలికా,
కలికాలోలవి చారు, చారుహరి భృత్ప్రాలంబు హేరంబునిన్

**"జైమినీ భారతము"** **పిల్లలమర్రి నవీరన**

దేవతలలో మొదటి మ్రొక్కులు గ్రహించేవాడు, చంద్రుడు అవతంసంగా గలవాడు మిక్కిలిగా మ్రోగుచున్న ఆభరణాలు గలవాడు, దేవతలు తనను నుతిస్తుండగా దానికి శ్రుతి పోసినట్లుగా ఉండే నిరంతర గండస్థల నుండి స్రవించే మదజలానికి మూగిన తుమ్మెదలయొక్క ఝుంకారానికి చొక్కేవాడు, సుందరమైన సర్పహారంకలవాడు అయిన హేరంబుని నేను నుతిస్తున్నాను.

కవి ఈ పద్యాన్ని ముక్తపదగ్రస్తంగా రచించినాడు.

శా॥ సర్గస్థిత్యపహార కర్మనవదీక్షావేళ బ్రహ్మాస్వ భూ
భర్గుల్విఘ్నము లేక సాగుటకు నై ప్రార్థింపగా తత్క్రియా
దౌర్గత్యంబు నదల్చి సంస్కరణ మాత్రం బాప్తి గావించు దృ
ఙ్మార్గచ్ఛృత్కరుణాకచంబు గొలుతున్ నిత్యంబు హేరంబునిన్

**"కాళహస్తీ మహాత్మ్యము"** **ధూర్జటి**

సృష్టిచేసే వేళలో బ్రహ్మ దాన్ని పాలించే వేళలో విష్ణువు, ఆ సృష్టిని ఉపసంహరించే వేళ శివుడు తమతమ కృత్యాలు నిర్విఘ్నంగా సాగటానికై ప్రార్థిస్తుండగా వారికాయాకార్యావసరాలతో కలిగే ఆటంకాలన్నీ తన స్మరణ మాత్రంతోనే తొలగించి తన కన్నులతో దయను వెదజల్లుతున్న హేరంబుని నేను నిత్యం సేవిస్తున్నాను.

ఉ॥ అంబుజగర్భ నిర్జర వరాదుల చేత సపర్యలందు హే
రంబు కృపాలంవలంబు ముని రాణ్నికురంబ మనోంబు జాత రో

లంబు దరస్మితా ననకళాజిత శారద చంద్రబింబు భూ
షాంబర రుగ్విడంబు విజితారిక దంబు భజంతు విద్యకై

**"అనిరుద్ధ చరిత్రము"** **కనుపర్తి అబ్బయామాత్యుడు**

బ్రహ్మ మొదలైన దేవతలచేత సేవలు పొందేవాడు. దయగలవాడు. మహర్షుల మనస్సులనే పద్మాలలో నివసించే గండు తుమ్మెద చిరునవ్వుతో శరత్కాలంలోని చంద్రబింబాన్ని జయించిన ముఖంకలవాడు తాను ధరించిన భూషణాంబరాల కాంతిలో దిక్కులన్ని ప్రకాశించేవాడు శత్రువులందరిని జయించినవాడు అయిన హేరంబుని నేను విద్యకై సేవిస్తున్నాను.

కవి ఈ పద్యాన్ని అంత్యానుప్రాసతో కూర్చినాడు.

శా॥ శ్రీ రాజిల్ల నిరంతరాయమునకై సేవింతు భావంబునన్
వైరి క్ష్మాధరశంభులన్ భువన దివ్యత్కీర్తి కాదంబులన్
పారాపార విడంబులన్ ముని మనః సంకేజరోలంబులన్
సారాచారకళావలంబులను విష్వక్సేన హేరంబులన్

**"ధనుర్విద్యా విలాసము"** **కృష్ణమాచార్యుడు**

వినాయకుడు సృష్టికి మొదటి దైవం. విఘ్నహంతకుడు కాబట్టి సమస్తజనులు అతని మొదలు పూజిస్తారు. అయితే వైష్ణవులకు శివుడారాధ్యనీయుడుకాడు కాబట్టి వారు గణపతిస్థానంలో విష్ణువుయొక్క సేనానియైన విష్వక్సేనుని పూజిస్తారు. కనుక కవి ఈ పద్యంలో ఆ యిద్దరిని కలిపి నుతించి హరిహరా భేద భక్తిని ప్రదర్శించినాడు.

నాకు తలపెట్టిన కావ్యానికి విఘ్నం కలుగకుండా ఉండే అందుకై శత్రువులనే పర్వతాలకు వజ్రాయుధాలైనవారు లోకంలో తమకీర్తి అనే మేఘాలు వ్యాపించినవారు, సముద్రంవంటి విశాలమైన యశంకలవారు మునులయొక్క మనస్సులనే పద్మాలలో ఉండే తుమ్మెదలైన వారు అయిన విష్వక్సేనుడు హేరంబుడు అను వారిని నేను సేవిస్తున్నాను.

ఉ॥ పంబిన సంబరంబున స్వభక్త్య మరక్తిగలట్టి వారి వి
ఘ్నంబుల డంబరంబులడగంబడ ద్రొక్కెడు మేటి ధాటిహే
రంబు పదాంబుజంబుల దిరంబుగ సెమ్మది నమ్మికొల్తు గాం
చెంబును గాని నాకయిత సేతకు జిక్కులు నిక్కకుండగన్

**"సత్యనారాయణ మహాత్మ్యము"** **ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

ఉప్పొంగిన సంతోషంచేత తనపై భక్తిగలవారి ఆటంకాల అణగద్రొక్కే ధాటిగల హేరంబుని పాదపద్మాలను గట్టిగా మనస్సులో నమ్మి నాకు ఆటంకాల కలుగకుండే అందుకు సేవిస్తున్నాను.

శా॥ శ్రీరమ్యమ్ముగ ధర్మసమ్మతముగా శ్రేయోనిధాన ప్రభా
పారమ్యమ్ముగ శాంతిసీమగ భువిన్ భాసిల్లగాజేసి, స
ర్వారంభంబులనున్ జయప్రదమొనర్పంజాలులో కేశుడౌ
హేరంబున్ ధృఢభక్తిభావములతో హృద్వీధి నర్చించెదన్

**"పర్వేశ్వరస్తవము"** **కొండేపూడి సుబ్బారావు**

ప్రపంచాన్ని ఐశ్వర్యంతో అందంగా, ధర్మసమ్మతంగా సమస్తమైన శుభాలకు నలయంగా కాంతికి చివరిదిగా శాంతికి సీమగా ప్రకాశించేటట్లు చేసి సమస్తమైన కార్యారంభాలను జయప్రదం చేయగలిగిన హేరంబుని నేను నా మనోవీధిలో ధృఢమైన భక్తితో పూజిస్తున్నాను.

# ఉదాహరణ గణపతి

## ప్రథమా విభక్తి

చ॥ ఎలుకల రాచతేజిపయి యెక్కుడు గాడ పరంజిపైడి ని
గ్గులు గల మేని పెన్వటుగు క్రొన్నెల దాల్పుపు ముద్దుపట్టి కొ
మ్ములు గలవేల్పు విఘ్న తరుమూలమ్ములం బెకలించు బిల్లి దుం
డల గణ భర్త యప్పు పచివా(గుణి కీవుత నొప్పితార్థముల్

**"రాజశేఖర చరిత్రము"** **మాదయగారి మల్లన**

ఎలుకలను జానపదులు ఎలుకరాజులు అంటారు. కనుక అటువంటి ఎలుకరాజు అనే గుర్రంపై ఎక్కేవాడు బంగారువన్నె శరీరంగల బ్రహ్మచారి, చంద్రరేఖను ధరించిన పార్వతి పరమేశ్వరుల ముద్దుల కొడుకు, కొమ్ములు లవాడు ఇతడు ఏకదంతుడుగాడు - ఏనుగులకు మ్రాకులు పెకలించటం ఇష్టం కనుక ఆటంకాలనే చెట్లను మొదలంట పెకలించి వేసే బలవంతుడు అయిన గణపతి మీకు కోరికలిచ్చుగాక ! ఇందులో విజయవినాయకుడు వర్ణియబడినాడు.

ఉ॥ మోదక హస్తహస్తి ముఖ మూషక వాహన! ఏకదంత లం
బోదర! తప్తకాంచన సముజ్వల విగ్రహా! బాలచంద్ర నే
ఖాధృతమౌళి! యంచు తనునచ్చపు భక్తి దలంచువారలన్
మోదము మీర బ్రోచు గణముఖ్యుని విఘ్నపతిన్ దలంచెదన్

**"వాల్మీకి చరిత్ర"** **రఘునాథరాయలు**

బాలచంద్రరేఖాధృతమౌళి - తలపై నెలబాలుని ధరించినవాడా! బాలచంద్రగణపతి, హస్తిముఖ=ఏనుగు ముఖం గలవాడా, ఏకదంత=ఒకే దంతం కలవాడా! ఏకదంత గణపతి

లంబోదర=వ్రేలాడుతూ ఉండే బొజ్జగలవాడా లంబోదర గణపతి

తప్తకాంచన సముజ్వల విగ్రహా = కాచిన బంగారంవంటి మేలిమి రంగు కలవాడా!

మోదకహస్త = చేతియందు కుడు ములను ధరించినవాడా! త్ర్యక్షర గణపతి, మూషకవాహన = ఎలుకతేజీ నెక్కినవాడా విజయగణపతి

అని తనను భక్తితో నిరంతరం తలిచేవారిని ఆటంకాలన్ని తొలగించి కాపాడుతూ ఉండే గణాధిపతియైన విఘ్నరాజును నేను సేవిస్తున్నాను.

ఈ పద్యంలోని విశేషణాలన్ని సామాన్యంగా ఒకే గణపతి పరంగానే ఉన్నా ఇందులో విఘ్నగణపతి, విజయ గణపతి, త్ర్యక్షర గణపతి, ఏకదంత గణపతి, దుర్గా గణపతి, బాలచంద్ర గణపతి, హేరంబ గణపతి, గణపతి అనే అష్ట విధ గణపతులు మనకు దర్శనమిస్తారు.

ఉ॥ వారణపర్య వక్త్రుడనివార్య బలోద్ధతు డంబికా మన
స్సారస బంభరంబు శరసంభవ పూర్వజు డంతరాయ దు
ర్వార తమశ్ఛటోగ్ర దినరాజు మహేశ సుతుండు భక్తి మం
దారము విఘ్ననాథుడు వినాయకుడీవు తమాతభీష్టముల్

**"సంగమేశ్వరమహాత్మ్యం"** **లోకాలక్ష్మీనృసింహశాస్త్రి, వేంకటశేషకవి సోదరులు**

మహేశ్వరుని కుమారుడు పార్వతీదేవి యొక్క మనః పద్మంలో ఉండే తుమ్మెద. కుమారస్వామి కంటె మొదట పుట్టినవాడు ఏనుగు ముఖం కలవాడు అనివార్యమైన బలంగలవాడు ఆటంకాలనే చీకట్లకు సూర్యుడు, భక్తులపాలిటి కల్పవృక్షం అయిన విఘ్నరాజు మీకు శుభాలిచ్చుగాక!

వారణవర్యవక్త్రుడు అని కవి ఇందులో పద్యాన్నెత్తుకోవటంలోనే వినాయకుడు విఘ్నాలను నివారించేవాడు అని కవి ధ్వనింపజేసినాడు.

ఉ॥ గౌరికి ముద్దుపట్టి యొడికంబులకుం గని యంతరాయముల్
పారగద్రోలు జెట్టి మదబంధుర సింధుర కంధరుండు సిం
గారము గుల్కువాడు మొనగాడు మదభ్యుదయైక లీలకున్
కారకుడై మజయ కృతి కాంతురసైకని తాంతుజేయుతన్

***"శాతవాహన చరిత్రము"***        ***చింతలపాటి నరసింహదీక్షితశర్మ***

గౌరీదేవికి ముద్దులకొడుకు. నేర్పులకు గని - ఆటంకాలు తొలగించే మొనగాడు మదించిన ఏనుగు ముఖం కలవాడు, అందగాడు మొనగాడైన గణపతి నాయొక్క కృతికాంతుని అనగా ఈ యొక్క కృతిభర్తతను ఎల్లప్పుడు రసానంద నిమగ్నునిగా జేయుగాక.

శంకరు కూర్మి నందనుడు సర్వజనస్తవనీయు డెన్నగా
పంకజనాభు ప్రేముడికి పాత్రుడు విఘ్నకరుండు విఘ్న నా
శంకరుడైన దైవమని సర్వసురల్ మునికోటి గొల్వగన్
సంకటముల్ వెలార్చు గణనాథుడు నాకు ప్రసన్నుడయ్యెడున్

***"ఆదర్శమైత్రి"***        ***మన్నవహరి సర్వోత్తమరావు***

శివునియొక్క ప్రియమైన కుమారుడు సమస్తమైన జనుల చేత నుతింపబడేవాడు, విష్ణువు యొక్క ప్రేమకు పాత్రుడైనవాడు, విఘ్నాలు కల్పించేవాడు నాశనం చేసేవాడు అని దేవతలు మునులు అందరూ సేవిస్తుండగా వారి సంకటాలన్ని తొలగించే గణపతి మీకు ప్రసన్నుడగు గాక!

చ॥ ప్రణుత విలింప భూజము పరాప్రముఖాఖిల వాక్ప్రపంచ కా
రణము పుమర్థ సంచయ నిరంతర దంతురి తాంతరాయ వా
రణ ముఖవోద్భవంబు నగరాజ సుతానయనోత్సవంబు వా
రణముఖ మాంతరాంధ తిమిరచ్ఛిదమౌ మహమాశ్రయించెదన్

***"సేతుబంధము"***        ***అవధానం చంద్రశేఖరశర్మ***

శివుని చేత జనించినది. పార్వతీదేవి కన్నులకానందం కలిగించేది. దేవతలందర్ని చేత సేవింపబడే కల్పవృక్షమైనది. పరాపశ్యంతి మొదలైన వాక్ప్రపంచానికి కారణమైనది. ఏనుగువంటి ముఖం కలది, అర్ధనారీశ్వరత్వాన్ని చేకూర్చేది ఏకదంతంతో ఉండి ఎల్లప్పుడు ఆటంకాలను నివారించేది, హృదయంలో ఉండే అజ్ఞానమనే చీకటిని తొలగించేది అయినటువంటి మహిమను నేను ఆశ్రయిస్తున్నాను.

పరా-పశ్యంతి-మధ్యమా-వైఖరి అని వాక్కు నాలుగు రకాలు. పరావాక్కు బిందురూపంలో ఆధారచక్రంలో ఉంటుంది. ఆ చక్రానికి అధిపతి గణపతి. ఆ పరావాక్కే ఊర్ధ్వంగా పయనించి ముఖభాగంనుండి వైఖరిగా వెలువడుతుంది. కనుక గణపతి పరాపశ్యంతి మొదలైన వాక్ప్రపంచానికంతా కారణమైన వాడౌతాడు.

శ్లో॥ నభూమీ నజలంచైవ, నతేజో నచవాయనః
నచం బ్రహ్మానచం విష్ణు నచం నక్షత్ర తారకాః

"సర్వశూన్య నిరాలంబం స్వయం భూ విశ్వకర్మణః"

సృష్టికంటె మొట్టమొదట అనగా పంచభూతాలు గ్రహతారకలు ఏదీలేని సర్వశూన్యంలో స్వయంభువైన విశ్వకర్మ అనగా మళ్ళీ ఈ సమస్త విశ్వాన్ని సృష్టించేకర్త - స్వయంభువైన ఆ విశ్వకర్మ-ఒక్కడు మాత్రమే ఉన్నాడని మన పురాణాలు చెబుతున్నవి. అపుడతనికి రూపంలేదు. ఇక సాకారంలో ఆ ఒక్కడు ఎవరు అన్నపుడు అతడు బ్రహ్మకావచ్చు విష్ణువు కావచ్చు, ఈశ్వరుడు కావచ్చు, గణపతి కావచ్చు మరెవరైనా కావచ్చు కాని అతడు మాత్రం విశ్వకర్మగానే ఉంటాడు.

ఈ పద్యంలో సాకారుడైన వినాయకుడు గాక వినాయకతత్వం నుతించబడింది.

సంబోధన - ప్రథమ -

శా॥ ఓ విఘ్నేశ్వర! విఘ్నరాజ! "యన"నేమోయీ! భవద్వాంఛ! యన్
స్వామిన్ గొల్తు సమగ్ర భక్తిమెయిగావ్యారంభ సంరంభ మం
దేమాత్రంబును విఘ్నముల్ గలుగనట్లింతే ననుం బ్రోవని
చ్ఛా మాత్రామిత సౌఖ్యదున్ గరిముఖన్ సద్భక్తి రాజినఖున్

**"శ్రీ బ్రహ్మేశ్వర పురాణము"** **దోమా వేంకటస్వామిగుప్త**

ఓ విఘ్నేశ్వరా! విఘ్నరాజా! అని పిలువగా ఏమోయి అని పలికే భక్తవరదుడు ఇచ్ఛామాత్ర చేతనే భక్తులకు సుఖాలు కలిగించేవాడు అయిన గజాననుని నేను కావ్యారంభంలో విఘ్నారంభాలు ఏమాత్రం కలుగకుండా ఉండే అందుకు కాపాడుమని ప్రార్థిస్తున్నాను.

ఉ॥ శ్రీగణనాయకా! శుభద! సిద్ధి వినాయక! బుద్ధి వినాయకా!
నాగవిభూషణా! రిపుజనార్ణవ శోషణ! భక్తపోషణా!
ఆగమశాస్త్రసార! నిగమాంత విహార! ఉమాకుమార! నీ
వే గతివేగ నాకృతి గణేశ! శుభాంతము సేయరా ప్రభూ!

**"పరీక్షి చ్చరిత్రము"** **గంగారాజేశ్వరరావు**

గణనాయకా! ఉమాకుమారా! శుభదా! సిద్ధి వినాయకా! బుద్ధి వినాయక! నాగభూషణా! శత్రుసాగరా శోషణా! భక్తపోషణా! ఆగమశాస్త్రసారా! నిగమాంత విహారా! నా కార్యాలు శుభాంతంగా చేయి తండ్రీ.

## ద్వితీయా విభక్తి -

మ॥ కమలాభ్యున్నతి కారణంబు కనకాకారో జ్జ్వలంబున్ మహా
గమచంచద్గతి పంచ వక్త్రవిలస త్కారుణ్య పాత్రంబ ఘ
భ్రమరాపాయ నిరాసదానము సదాభూపాభి వంద్యంబు నా
హిమభూమీధర భూభవంబు గులిచి త్రే భేంద్రమున్ గొల్చెదన్

**"ఉషా పరిణయము"** **దామెర్ల అంకభూపాలుడు**

ఇందులో గణపతి ఒక పెద్ద ఏనుగుగా వర్ణించబడినాడు. పర్వత సంబంధమైన భూమిలో - పార్వతి కడుపులో - పుట్టినది. బంగారు వన్నె కలది. శివుని దయకు పాత్రమైనది. గొప్పగొప్ప కొండలలో - ఆగమాలలో-తిరుగుతూ ఉండేది. ఆటంకాలనే తుమ్మెదలను తనయొక్క మదజలంతో తొలగించేది, ఎల్లప్పుడు మహారాజులందరిచేత మ్రొక్కబడుతూ ఉండేది. అయిన ఒకానొక విచిత్రమైన గజరాజును నేను సేవిస్తున్నాను.

ఏనుగులు పర్వతాలలో పుడుతుంటవి. మేలుజాతి ఏనుగులకు శరీరంపైగల రోమాలు, దంతాలు వయోల్బణంలో వాని శరీరంపై ఏర్పడే శోభి మచ్చలు బంగారు రంగులో ఉంటవి. ఏనుగు శివానుగ్రహ పాత్రమైన జంతువు. మహారాజులు పూర్వం ఉదయం లేవగానే తమ పట్టపుటేనుగు ముఖంచూచి దాన్ని పూజిస్తుండేవారు. కనుక ఈ గజ.విశేషాలన్ని కవి పై పద్యంలో ధ్వనింజచేసినాడు.

అణిమాద్యష్ట విభూతి దాయకునిగా నాత్మ న్నుతింతు న్మహా
ప్రణవాధీశ్వరు పార్వతీ తనయునిన్ భక్తావనున్ వాజ్మనో
మణిపీఠంబున పూజసేసి విలసన్మంత్రంబులన్ న్నిత్యమున్
గణనాథున్ గుణనాధుసిద్ధరకతంగా నన్నును నుంబ్రోవగన్

**"విశ్వకర్మ పురాణం"** **వీపూరి వేంకటాచార్యులు**

గణపతియొక్క వంకరగా తిరిగిన తొండం ఓంకారానికి సంకేతం కనుక అతడు ప్రణవానికి అధిపతి. అణిమాది సిద్ధులను ఈయగలవాడు. అందుచేతనే అతనికి సిద్ధివినాయకుడని పేరు.

పార్వతీదేవి కుమారుడు భక్తులను కాపాడువాడు ప్రణవమునకు అధిపతి మరియు అణిమాది అష్టసిద్ధులిచ్చువాడని దేవగణనాథుడైన గణపతిని నాయొక్క వాక్కు మనస్సులనే రత్నపీఠంపై నిలుపుకొని శ్రేష్ఠమైన మంత్రాలతో నిత్యం నన్ను రక్షించే అందుకు నుతిస్తున్నాను.

చ॥ కరకమలంబులెత్తి యొడికంబుగ మ్రొక్కి నుతింతు బార్వతీ
శ్వరుల తనూజునిం గనకసన్నిభతేజుని బద్మసంభవాం
బురుహనిభాక్ష ముఖ్య సురపూజిత పాద పయోజునుజ్జ్వ ల
త్వరమ దయాకటాక్ష పరిపాలిత భక్త సమాజు నర్మిలిన్

**"బేరీజు పద్యములు"** **విస్సాప్రగడ కామరాజకవి**

పార్వతీపరమేశ్వరుల కుమారుడు బంగారు రంగుగలవాడు బ్రహ్మమొదలైన వారిచేత పూజింపబడే పాదపద్మాలు గలవాడు పరమ దయతో భక్తులను పరిపాలించేవాడు అయిన వినాయకుని నేను ప్రేమతో చేతులెత్తి మొక్కి నుతిస్తున్నాను.

కవి ఇందులో కరకమలంబులెత్తి అని తన చేతులను కమలాలతో పోల్చుకోవటంలో చేతి ఎత్తుగడలో పుష్పపూజకూడ కలిసి వచ్చింది.

ఉ॥ శ్రీయలరార సన్నుతులుసేసి నిరంతర భక్తిగొల్తు దా
క్షాయణి సత్కుమారకు భుజంగమ సంచమహారకున్ల స
త్కాయ విభావిశేష జతగైరికు దుండ కృతాహికారకున్
న్యాయవిచారు పత్పథ విహారు వినాయకు కామ్య దాయకున్

**"రావణ దమ్మీయము"** **పిండిప్రోలు లక్ష్మణకవి**

దాక్షాయణీదేవి కుమారుడు పాములను హారాలుగా ధరించినవాడు, తన శరీరకాంతితో గైరిగాన్ని అనగా జేగురుదనాన్ని లక్ష్యంప చేసేవాడు, పామువంటి తొండం కలవాడు. న్యాయవిచారుడు, శ్రేష్ఠమైన మార్గంలో సంచరించేవాడు, కోరికలన్ని ఇచ్చువాడు అయిన వినాయకుని నేను నిరంతరం భక్తితో సేవిస్తున్నాను.

ఇందులో వినాయకుడు దాక్షాయణి కుమారుడుగా చెప్పబడినాడు. శివపురాణ ప్రకారం గణపతి [illegible]ని కుమారసంభవ ప్రకారం అతడు దాక్షాయణి అనగా సతీదేవి కుమారుడు. నల్లనివాడు నతీశివులు గజరూపాలు ధరించి క్రీడించగా సద్యోగర్భంలో జనించినాడు. కాని ఈ కవి ఇందులో అతనిని గైరిక వర్ణుడని చెప్పినాడు. రూపధ్యాన రత్నావళిలోని భేదాలలో శోణవర్ణ భేదాలెక్కువ కాబట్టి ఆ రూఢి ననుసరించి యితడు గణపతిని ఎర్రనివాడుగా చెప్పి ఉంటాడు.

ఉ॥ మూషక వాహనున్ బహుళ మోదక ఖాదకు నేకదంతునిన్
భూషణ సర్పరాజకుని భూరిమహోదరు నీశుపుత్రునిన్
లోషణవేషు విఘ్నముల ద్రోసి శుభంబుల గూర్చు దేవునిన్
పోషిత భక్తులంగలుగు ప్రోడ వినాయకు భక్తి గొల్చెదన్

***"కృష్ణ కర్ణామృతం"*** ***కల్లూరి అహోబిలరావు***

శివుని కుమారుడు ఎలుకనెక్కినవాడు, ఒకే దంతంకలవాడు, కుడుములు ధరించినవాడు, ఆటంకాలు తొలగించి శుభాలు చేకూర్చేవాడు అయిన వినాయకుని భక్తితో సేవిస్తున్నాను.

ఈ పద్యం అంతా ద్వితీయా విభక్తిలో కూర్చబడింది. ఇందు నుతించబడినవాడు విజయగణపతి.

శా॥ విఘ్నద్వాంత నిరాస వాసర పతిన్ వేదండ రాజాననున్
విఘ్నాధీశ్వరునిన్ గపోలఫల కావిర్భూత దానచ్ఛటా
విఘ్నాళిన్ నిరుపాధి కాధిక కృపా విత్యోద యోపఘ్ను గ్రౌం
చఘ్ను జ్యేష్ఠు భజింతు గావ్యరచనా చాతుర్య సంసిద్ధికై

***"అనిరుద్ధ చరిత్రము"*** ***భావన పెమ్మన***

ఆటంకాలనే చీకట్లను తొలగించే సూర్యుడు ఏనుగుముఖం కలవాడు ఆటంకాలకు అధిపతి ఊరుతూ ఉండే మదజలంలో కడతలు కప్పబడినవాడు సాటిలేనట్టువంటి దయకు ఆధారమైనవాడు క్రౌంచ పర్వతాన్ని రంధ్రంకొట్టిన కుమారస్వామి కంటే పెద్దవాడు అయిన గజముఖుని కావ్యరచనా చాతుర్యం సిద్ధించే అందుకు సేవిస్తున్నాను.

దుష్కర ప్రాసతో కూడినా అనిరుద్ధంగా సాగిన ఈ పద్యం కవిగారికి గణపతి అనుగ్రహించిన కావ్య చరనా చాతుర్యానికి ప్రధమ నిదర్శనంగా ఉంది.

మ॥ తలతున్ భక్తజనావనున్ గజముఖున్ దాంతున్ దయాస్వాంతునిన్
కలుషారణ్య దవానలున్ పరమరాగ ద్వేష దుఃఖాంతకున్
తొలిపూజన్గొను వానిభక్త సులభున్ దోషాపహారున్ సు వి
ద్యలు సౌభాగ్యము లిచ్చునట్టి నెరదాతన్ శ్రీగణాధీశ్వరున్

***"శ్రీ శివకామేశ్వరీ కళ్యాణం"*** ***వద్దూరి అచ్యుతరామకవి***

నేను గజముఖుడు, దాంతుడు, దయాపరుడు భక్తులను బ్రోచేవాడు, పాపాలనే అరణ్యాలను కాల్చేవాడు, వరదుడు రాగద్వేషాది దుఃఖాలు తొలగించేవాడు, మొదట పూజలందుకొనేవాడు, భక్తసులభుడు, దోషాలు తొలగించువాడు, వెరదాతయైన గణపతిని నుతిస్తున్నాను.

ఈ పద్యంలో వినాయకునికి ఉండే గుణాలన్ని తెలుపబడినవి.

## తృతీయా విభక్తి

మ॥ తనదంతాగ్రము చేత తీక్ష్ణమతి యుద్యత్కుంభయుగ్మంబు చే
తనితాంతోన్నతి దాన విస్ఫురత నుత్సాహంబు శుండాముఖం
బున దీర్ఘాయువు నిచ్చుగావుత గుణాంభోరాశికిన్ కృష్ణ రా
యనికిన్ వారణ రాజవక్త్రుడు కృపాయత్తైక చిత్తాబ్జుడై

"పారిజాతాపహరణము" ముక్కు తిమ్మన

గజముఖంగల వినాయకుడు కృపగల హృదయంగలవాడై శ్రీకృష్ణదేవరాయలకు పాఠకులకు తనయొక్క కుంభయుగ్మంతో ఎల్లప్పుడు ఉన్నతిని దంతాగ్రంలో తీక్షణమైన మతిని నిడుపైన తొండంతో దీర్ఘాయువును యిచ్చుగాక.

కుంభస్థలం అనగా ఏనుగుయొక్కతల. పెద్ద తలకాయ ఉన్నతికి బుద్ధిబలానికి గుర్తుకాబట్టి అటువంటి పెద్దతలగల గణపతి కృష్ణదేవరాయలకు (పాఠకులకు) మేధా బలమూలకమైన ఉన్నతిని. దంతశబ్దం జ్ఞానానికి చిహ్నం. మానవులకు కూడ జ్ఞానదంతాలు వచ్చిన పిమ్మటనే బుద్ధిబలం వికసిస్తుంది. కాబట్టి అటువంటి దంతంగల ఏకదంతుడు నిశితమైన జ్ఞానాన్ని -

ఏనుగుయొక్క తుండం నిజానికి దానియొక్క ముక్కు అదే చేయిగా కూడ దానికి పనిచేస్తుంది. నాసిక ప్రాణవాయువును నడిపేది నిలిపేది కాబట్టి అది అయుష్యానికి చిహ్నం అందుచేత దీర్ఘమైన తుండంగల గణపతి దీర్ఘాయుష్యాన్ని యిచ్చుగాక.

## చతుర్థీ విభక్తి

ఉ॥ ఆదరమొప్ప మ్రొక్కెదుదు నద్రి సుతా హృదయాను రాగ సం
పాదికి, దోష భేదికి ప్రసన్న వినోదికి విఘ్నవల్లి కా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జన నందవేదికిన్
మోదక ఖాదికిన్ సమద మూషకసాదికి సుప్రసాదికిన్

"భాగవతము" పోతనామాత్యుడు

నేను పార్వతీదేవియొక్క మనస్సునకు సంతోషము కలిగించే వానికి పాపాలను తొలగించేవానికి. ఆశ్రయించే వారిని. ఆనందపరచే వానికి ఆటంకాలను ఖండించే వానికి మంజులమైన వాక్కులు గలవానికి లోకమందలి సమస్తమైన ప్రజలను ఆనందింపచేసేవానికి కుడుములను తినేవానికి పొగరెక్కిన ఎలుక తేజిని ఎక్కేవానికి శుభాలిచ్చేవానికి మిక్కిలి భక్తితో నమస్కరిస్తున్నాను.

దేవతలెప్పుడేగాని ప్రత్యక్షస్తుతి ప్రియులుగారు. పరోక్ష స్తుతి ప్రియులు అనగా వారిని స్వనామంతో వాచ్యంచేసి స్తుతించటం కంటె విశేషణాలతో నుతించుటే ఎక్కువ ప్రీతిదాయకం. ఆ మర్యాదనెరిగిన పోతనగారీ పద్యంలో వినాయకుని ఎక్కడగూడ వాచ్యం చేయకుండ మర్యాదను పాటించి నుతించినాడు.

ఎలుకనెక్కినవాడు అనగా ఇతడు విజయగణపతి. ఈ పద్యం షష్ఠ్యంతాలలో కనిపించినా నమస్కారాలకు సంస్కృతంలో చతుర్థీ విభక్తినేవాడుతారు. - తెలుగువారు చతుర్థికి బదులుగా తకుడషష్ఠిని చతుర్థి అర్థంలోవాడుతారు.

# బహురూప గణపతి

చ॥ అతిసితిచేత రమ్యకలశాబ్ధి సుతాభరణంబు చేత సం
తత సదహీనభూతి కలితాకృతి చేతను తంద్రిమామ సం
గతులను బొల్చు కీర్తి దగగైకొని నట్టి ఘనున్ ప్రసన్న స
న్నుతి వదనున్ ప్రసన్న వదనున్ ప్రణుతింతు నభిష్ట సిద్ధికిన్

**"భానుమద్విజయము"** **వెలగపూడి కృష్ణయ్య**

ఈ పద్యంలో వినాయకుడు శివకేశవులిద్దరితో పోల్చబడినాడు. శితిశబ్దం తెలుపు నలుపు రెండర్థాలలో వర్తిస్తుంది. వినాయకుడు తెలుపు నలుపు ఎరుపు మరియు బంగారు వన్నెలలోగూడ ఉన్నట్లు చెప్పబడుతున్నాడు కనుక అతిశితిచేత మిక్కిలి తెల్లదనంతోను, కలశాబ్ధి సుతాభరణంబుతో అనగా కలశాబ్ధి సుతుడు చంద్రుడు కనుక అతనిని ధరించి శివునితోను, కలశాబ్ధి సుత లక్ష్మి కనుక ఆమెను ధరించి విష్ణువుతోను సదహీనభూతి కలితాకృతిచే అనగా శ్రేష్ఠమైన సర్పభూషలు గలవాడు శివుడు కనుక నాగయజ్ఞోపవీతం నాగబంధం ధరించి తండ్రితోను, సదహీనభూతి అనగా కొదువలేని శ్రేష్ఠమైన ఐశ్వర్యంతోగూడి విష్ణువుతోను పోలినవాడై పార్వతికి నారాయణి అని పేరు. ఆమె విష్ణువు యొక్క సోదరిగా చెప్పబడుతుంది కాబట్టి వినాయకుడీ విధంగా తండ్రి మరియు మేమామ యొక్క సంగతులను పోలినవాడైనాడు కనుక అట్టి గణపతిని నేను అభీష్టసిద్ధికై ప్రార్థిస్తున్నాను.

మ॥ అనయంబద్రి సుతామనో హరుడు నెయ్యంబొప్ప లాలించుచున్
దనపై నెక్కుడు వేడ్క జూపగ సముద్యల్లీల వర్తించు ధ
న్యనపీనోత్కట దానశాలి ఘనతుండుస్ సాధుపక్షోజ్వలుస్
వినతానంద కరున్ వినాయకుని భావింతుస్ శుభావాప్తికిస్

"చారుచంద్రోదయం" చెన్నమరాజు చెన్నమరాజు

ఇది గణపతి మరియు ఖగపతి పరంగా రెండర్థాలలో ఉంది.

వినాయకుడు శివుడు నిరంతరం లాలిస్తు తనపై ఎక్కిన ప్రేమ జూపగా వర్తించేవాడు. గొప్పనైన మదజలంతో కూడిన తుండంకలవాడు. సాధువులపై దయగలవాడు. వినయంతో ఆశ్రయించేవారి కానందం కలిగించేవాడు అయిన వినాయకుని శుభం కొరకు భావిస్తున్నాను.

గరుడు - ఎల్లవుడు గూఢ సూర్యుని కూతురైన కాళిందీ పతి అనగా విష్ణువు తనపై అధిరోహించే అందుకు మక్కువ చూపుతూ ఉండగా వర్తించేవాడు. వార్థక్యం లేనివాడు. మిక్కుటమైన గుణాల కలవాడు, గొప్పనైన చుంచువు గలవాడు, సమర్థమైన రెక్కలచే ప్రకాశించేవాడు. తల్లియైన వినతకు దాస్యం తొలగించి ఆనందం కలిగించినవాడు అయిన పక్షీంద్రుని నేను శుభాలకొరకు ప్రార్థిస్తున్నాను.

మ॥ వినుతింతుర్ విబుధేంద్ర చిత్రముగ నావిర్భూత సంవిత్సు ధా
ఘన సంపాదనకై సువర్ణరుచి పక్షస్ఫూర్తియై పుష్క రా
ప్తిని గ్రీడించు సుకీర్తి యోగ శుభమూర్తిన్ దక్షదౌహిత్రు న
వ్వినతా నందకరున్ వినాయకుని నిర్విఘ్న ప్రభావాప్తికిన్

"ఆధ్యాత్మ రామాయణం" కాణాదం పెద్దన సోమయాజి

ఈ పద్యంలో గూఢ శ్లేషతో గణపతి గరుడులిద్దరు నతింపబడినారు.

దేవతల్లందరూ ఆశ్చర్యపడేటట్లుగా జ్ఞానామృతాన్ని సంపాదించే అందుకు శ్రేష్ఠమైన వర్ణములతో కూడిన మంత్రంచేత స్ఫూర్తి పొందినవాడు మూలాధార కమలమునందు విహరించు యోగమూర్తి తామరలతో [illegible] వినయంతో నమస్కరించు భక్తులకు ఆనందం కలిగించే వాడైన వినాయకుని నిర్విఘ్నంగా మా పనులు చక్కబడే అందుకు నేను ప్రార్థిస్తున్నాను.

ఇంద్రుడాశ్చర్యపడునట్లుగా విజృంభించి దేవతలచేత రక్షింపబడే అమృతాన్ని సాధించుటకై తన రెక్కల బలంతో స్ఫూర్తిని పొందినవాడు ఆకాశంలో విహరించేవాడు యోగప్రదుడు దక్షునికి మనుమడు వినతకు ఆనందం కలిగించినవాడు అయిన గరుడుని నిర్విఘ్నం కొరకై నేను నుతిస్తున్నాను.

మ॥ వినతానందనతన్ సుధాపహరణోద్వేలోక్తి నార్యాను వ
ర్తన సంపత్తి హృతాబ్జ దైభవముఖోద్యల్లీ లగాంగేయ ప
క్షనిరూఢిన్ శతకోటి భాస్వదమల ఖ్యాతి ప్రభాతి ప్రవ
ర్ధనతన్ మించు వినాయకుండు గెడపున్ ప్రత్యూహ సర్పచ్ఛటన్

**"సమీరకుమార విజయం"** **పుష్పగిరి తిమ్మన**

వినాయకుడనగా గణపతి ఖగపతి కనుక ఇది గూడ ఆ యిద్దరి పరంగా చెప్పబడింది. వినయంగా తన నాశ్రయించిన వారిని ఆనందింపజేసేవాడు తేనెలు చిలుకే మాటలుగలవాడు సాధుమార్గమైన వర్తనగలవాడు చంద్రుని జయించిన ముఖంకలవాడు, బంగారు రంగు గలవాడు. వజ్రాయుధం వలె ప్రకాశించె ప్రభగలవాడు అయిన వినాయకుడు మీ యొక్క ఆటంకాలనే సర్పాలను పారద్రోలుగాక!

వినతను సంతోషింపజేసినవాడు అమృతం హరించటంలో పరాక్రమం ప్రదర్శించినవాడు చంద్రునివంటి ముఖకాంతిగలవాడు బంగారు రెక్కలు గలవాడు వజ్రాయుధానికి పాటియైన బలమైన రెక్కలుగల వాడైన గరుత్మంతుడు మీ ఆటంకాలనే సర్పాలను పారద్రోలుగాక!

శ్లో॥ కుంకుమాంకిత వర్ణాయ కుందేందు ధవళాయచ

అని గరుడునిస్తుతి - మేలిమి బంగారానికి కుంకుమ వర్ణమేశాస్త్రంలో చెప్పబడుతుంది. కనుక గరుత్మంతుడు కుంకుమాంకిత వర్ణుడు.

మ॥ భగవన్నామ ధృతి ప్రకాశితుడు సర్వజ్ఞుండ హీనాత్మ హా
రి గరుండూర్జిత కామజైత్రృడ మృత శ్రీయుక్తుడ ధ్యాత్మ్రుడున్
సుగతుండాశ్రిత పక్షుడుత్తమ కళా శోభాతిరేకుండు సూ
రిగణస్తుత్యుడు సౌవినాయకుడు కోర్కెల్ దీర్చి మమ్మోముతన్

**"సారంగధరీయము"** **పోకూరి కాశీపతి**

వినాయకుడు సర్వదేవతా స్వరూపుడు. వినాయక శబ్దానికి - గణపతి, గరుత్మంతుడు, బుద్ధుడు, గురువు అని అర్థం వినాయకుడు కాబట్టి ఈ పద్యంలో నాలుగర్థాలు కూర్చబడినవి.

భగవంతుడు. షడ్గుణ పూర్ణుడు. గణపతి భగవంతుడు అని పిలువబడేవాడు. సర్వజ్ఞుడు. అనగా అన్ని తెలిసినవాడు. ఆ హీనాత్మహారియనగా గొప్పనైన కాముని జయించినవాడు. అమృతశ్రీ యుక్తుడు అనగా అమరత్వము దేవత్వమనే సంపద లభించినవాడు. అధ్యాత్ముడు అనగా ఆత్మసంబంధమైనవాడు సుగతుడు అనగా మంచి జ్ఞానము కలవాడు ఆశ్రిత పక్షుడు అనగా తననాశ్రయించు వారియందు పక్షపాతము గలవాడు ఉత్తమ కలాశోభాతిరేకుడు అనగా శ్రేష్ఠమైన విద్యలచే శోభించువాడు. సూరి గణస్తుత్యుడు అనగా పండితులచేత నుతింపబడువాడు అగు వినాయకుడు మా కోరికలు గరుత్మంతుడు దీర్చి రక్షించుగాక.

## గరుత్మంతుడు -

భగవంతుడనే పేరుగల విష్ణువును ధరించినవాడు. సర్వజ్ఞుడు అనగా అన్ని తెలిసినవాడు, అహినాత్మహారి అనగా సర్పముల యొక్క ప్రాణములను హరించువాడు. గురుడు అనగా గొప్పవాడు, అమృత శ్రీయుక్తుడు అమృతమును సంపాదించినవాడు. ఊర్జిత కామజైత్రుడు అనగా అమృతమును సాధించియు దానికొరకు లోలుపుడు కాలేదు. గాన గొప్పనైన కోరికను జయించినవాడు, అమృత శ్రీయుక్తుడు. ఆధ్యాత్ముడు ఆత్మసంబంధమైనవాడు ఆశ్రితపక్షుడు అనగా రెక్కలనాశ్రయించినవాడు సుగతుడు. సు అనగా శ్రేష్టమైన ఆకాశమార్గమున పోవువాడు ఉత్తమకళాశోభాతి రేకుండు అనగా శ్రేష్టమైన కళలతో శోభించువాడు సూరిగణస్తుత్యుడు అనగా పండితులచే నుతింపబడువాడు అయిన గరుత్మంతుడు మీ కోరికలు దీర్చి రక్షించుగాక !

## బుద్ధుడు -

భగవంతుడని పిలువబడినవాడు. సర్వజ్ఞుడనే పేరుగలవాడు గొప్పనైన హృదయంతో ప్రకాశించేవాడు గొప్పవాడు. ఊర్జిత కామజైత్రుడు అనగా తపస్సు చేసే కాలంలో మన్మథుని పరీక్షలకు నెగ్గి గెలిచినవాడు, అమృతత్వ పదవినందినవాడు. ఆధ్యాత్ముడు అనగా ఆత్మ విద్యనెరిగినవాడు సుగతుడనే పేరుగలవాడు తననాశ్రయించిన వారిపై ప్రేమగలవాడు శ్రేష్టమైన కళలలో శోభించువాడు సూరిగణస్తుత్యుడు అనగా సారమతము గలవారిచే నుతింపబడేవాడు. వినాయకుడనగా ప్రాణులయొక్క హితమును బోధించువాడు అయిన బుద్ధదేవుడు మీ ఆటంకములు తొలగించి రక్షించుగాక.

## విష్ణువు -

భగవంతుడనే పేరుతో ప్రకాశించేవాడు అన్ని తెలిసినవాడు, అహినాత్మహారి. అనగా గొప్పనైన ఆత్మను ధరించినవాడు, గురుడు గొప్పవాడు ఊర్జితకామ జైత్రుడు గొప్పనైన కోరికలన్ని జయించినవాడు అనగా అకాముడు అమృత శ్రీయుక్తుడు అమృతస్వరూపమైన లక్ష్మితో కూడినవాడు, ఆధ్యాత్ముడు, విద్యలలో అధ్యాత్మవిద్యయైనవాడు శ్రేష్టమైన గతిగలవాడు ఆశ్రయించిన వారిపై పక్షపాతము గలవాడు శ్రేష్టమైన కళలలో ప్రకాశించువాడు సూరిగణస్తుత్యుడు అనగా నిత్య సూరులలో పొగడబడేవాడు శ్రేష్టమైన నారాయణుడు అయినే విష్ణువు మీ ఆటంకములు తొలగించి రక్షించుగాక.

ఇంద్రుడు :-

భగవన్నామ ధృతిప్రకాశితుడు - గౌతముని శాపమున శరీరమంతయు యోనులయ్యెను కనుక భగవంతుడనబడినవాడు కామరూపులను అనగా రాక్షసులను జయించినవాడు అమృతైశ్వర్యము గలవాడు ఆత్మస్వరూపమైనవాడు. శ్రేష్టమైన గతిగలవాడు. ఆశ్రయించినవారి పక్షం వహించువాడు ఉత్తమమైన కళలచే ప్రకాశించువాడు పండితులచే పొగడబడినవాడు అయిన దేవతలకు నాయకుడగు యింద్రుడు మీ ఆటంకములను తొలగించి రక్షించుగాక.

శివుడు :-

భగవంతుడనే పేరు గలవాడు. సర్వజ్ఞుడనే పేరుగలవాడు సర్వశ్రేష్టుడైన వాసుకి హారంగా గలవాడు. గొప్పవాడు, గొప్పవాడైన మన్మధుని సంహరించినవాడు అమృత్వశ్రీలో అనగా ధావళ్యములో కూడినవాడు ఆధ్యాత్మ స్వరూపుడు శ్రేష్టమైన జ్ఞానంగలవాడు ఆశ్రితులపై పక్షపాతం గలవాడు చంద్రునియొక్క ఉత్తమమైన కళలో ప్రకాశించేవాడు పండితులతో నుతింపబడేవాడు అయిన గొప్పవాడగు శివుడు మీ ఆటంకాలు తొలగించి రక్షించుగాక!

గురువు :-

భగవంతుడని చెప్పబడేవాడు. అన్ని తెలిసినవాడు గొప్పనైన హృదయం కలవాడు గురువు అయినవాడు గొప్పనైన కోరికలు జయించినవాడు, అమృతత్వ సిద్ధితో కూడినవాడు ఆధ్యాత్మవిద్య నెరిగినవాడు శ్రేష్టమైన మార్గమున సంచరించువాడు తన నాశ్రయించినవారిపై ప్రేమగలవాడు శ్రేష్టమైన కళలలో ప్రకాశించువాడు. పండితులలో నుతింపబడువాడు అయిన గురుదేవుడు మీ ఆటంకములన్ని తొలగించి రక్షించుగాక!

# మ్రొక్కుల గణపతి

చ॥ నరసిజముఖ్య శర్వ సురసంఘము సర్వశుభార్థ సిద్ధి కు
స్థిరముగ జెంద నెవ్వని విధిజ్ఞత పూజలొనర్తు రట్టి యా
ద్విరదముఖున్ వినాయకుని దివ్య భుజంగమ భూషణాంచితున్
వరదుని వేడి మ్రొక్కెద నపార కవిత్వ పటుత్వ సిద్ధికిన్

"యోగసక్తా పరిణయము" మద్దిపట్ల అప్పన్నశాస్త్రి

బ్రహ్మ మొదలైన సమస్త దేవసంఘమంతా సమస్తమైన శుభాలకొరకు సిద్ధి కొరకు విధిప్రకారంగా ఏ దైవాన్ని పూజిస్తారో అటువంటి ఏనికముఖంకల వానిని భుజంగ భూషణుని నేను అపారమైన కవితాసంపద యొక్క పటుత్వం కొరకు మ్రొక్కుతున్నాను.

ఇది యోగసక్తా పరిణయంలోనిది. ఈ కావ్యాన్ని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం వారు నాతో క్రీ.శ. 1986లో పరిష్కరించినారు.

యోగాసక్త బృహస్పతి సోదరి కాబట్టి ఆమె పరిణయాన్ని ప్రబంధీకరించదలచిన అప్పన్నశాస్త్రి ఇందులో గణపతిని ద్విరదముఖుని అనగా రెండు దంతాలుగల ఆది వినాయకుని నుతించటం గమనార్హం.

శా॥ గౌరీపుత్రుని ప్రస్తుతింతు మదినే కార్యంబు చేబూనినన్
దీరన్ విఘ్నములన్నియున్ మనసు సంధ్యేయంబు చేకూరగా
బూరెల్గారెలు పప్పు పాయసము సంపూర్ణంబుగా బెట్టి యే
పారన్ మ్రొక్కెద నేకదంతు వరదున్ పాపఘ్ననక్రాంతమున్

***"తొలకరిజల్లు"*** ***చోడవరపు సత్యవతీదేవి***

నేను ఏ పని చేపట్టినా మొట గౌరీపుత్రుడైన వినాయకుని విఘ్నాలన్ని తొలగే అందుకై బూరెలు గారెలు పప్పు పాయసం నైవేద్యం పెట్టి మ్రొక్కుతుంటాను.

ఈనాడు స్త్రీలు అన్ని రంగాలలో ఉన్నా పాకశాలవారి ప్రధానరంగం కాబట్టి ఈ పద్యంలో సత్యవతీదేవిగారు భక్తితో వినాయకుని బూరెలు గారెలు పప్పు పాయసం అనే నైవేద్యాలు పెట్టి నమస్కరించింది.

పెరుమాండ్లకైనా పెట్టేవాడే చుట్టంగదా మరి.

చ॥ పరగను భారమిప్పుడును బాగని నీవయి నేసి నేనాగిన్
కరముగ కైత జెప్పెదను గాని ధరిత్రిని తప్పులున్న మీ
రరయగ బ్రోగ జేసి కడు నందరికిన్ దగమెచ్చ జేయు మో
కరిముఖ నిన్ను వేడి భలుగా స్తుతి జేసి నమస్కరించెదన్

***"ఆంధ్రఫలగ్రంథము"*** ***అమరచింత జ్యోత్స్యం పద్మనాభయ్య***

స్వామి! వినాయకా! భారమంతా నీపైనే వేసి నేను కవిత్వం చెబుతున్నాను కనుక నా రచనలో ఏవైనా దోషాలున్నా వాటిని సాటించకుండా అందరిచేత బాగనిపించుమని నిన్ను ప్రార్థించి నమస్కరిస్తున్నాను.

చ॥ చదువగలేదు శాస్త్రముల సజ్జనసేదలోనర్చి ధర్మముల్
మదినెరుంగంగలేదు బుధమండలి మెచ్చుకవిత్వమల్లగా
మొదలిడినాడ నెట్లు కడనుట్టగ నిల్పెదొ విఘ్ననాధత్వ
త్పద కమల ద్వయంబునకు భక్తి ప్రణామము లాచరించెదన్.

**"మాధురి సుధాకరము"** **కోట వీరాంజనేయ శర్మ**

ఓ గణపతీ ! నేను శాస్త్రాలు చదువలేదు. సజ్జనసేవజేసి ధర్మాలెరుగలేదు. అట్టివేవి లేకుండానే పండితులు మెచ్చునట్లుగా కవిత్వ మల్లవలెనని నీ పాదకమలాలకు భక్తితో మ్రొక్కుల్లుతున్నాను. నన్నేవిధంగా కడముట్టించగలవో నీదే భారం.

ఇది కవులందరు సాధారణంగా చెప్పుకునే మాటే కాళిదాసంతటి వాడే పండితులు మెచ్చినంతవరకు నా కవిత్వం నేను చక్కగా ఉందని అనుకోను అంటాడు కాబట్టి ఇది ఆయా కవులయొక్క వినయానికి నిదర్శనం.

చ॥ తొలుతన విఘ్న మస్తనుచు దోరపు భక్తి గణాధినాధునిన్
వలిమలపట్టి పట్టినినవారి తదీక్షను వ్యాస భారతం
బలయక గంట మించుకయు నాపక వ్రాసిన లేఖకాగ్రిణిన్
దలచెద మత్కవిత్వము బుధాగ్రణులన్ తని వొంద జేయగన్

**"ఫల్గుణీ మాహాత్మ్యము"** **వేదుల మీనాక్షీదేవి**

నేను మొట్టమొదట పార్వతీదేవి కుమారుడైన అచంచలమైన దీక్షతో వ్యాసమహర్షి చెబుతున్న భారతాన్ని ఏమాత్రం అలసటలేకుండ గంటం ఆపకుండ వ్రాసినటువంటి లేఖకాగ్రణియైన గణపతిని అవిఘ్నమస్తని నాయొక్క కవిత్వం పండితులను మెప్పింద జేయటానికి నితిస్తున్నాను.

పూర్వం కవులకు వ్రాయసగాండ్రు వేరే ఉండేవారు. ఆశువుగా వారు చెబుతూ ఉండగా దాన్ని వ్రాసేవారు. ఆ విధంగా తిక్కనగారి భారతాన్ని కుమ్మరి గురునాథుడు వ్రాసినాడంటారు.

ఈ పద్ధతికి శ్రీకారం చుట్టినవాడు గణపతి ఆయన మొదటిసారిగా వ్యాసమహర్షి భారతాన్ని వ్రాసినాడట. ఆ విధంగా వ్రాసే అప్పుడు కవి లేఖకుడుకి ఇద్దరు ప్రతినలు గూడ చేసి కూర్చునేవారట.

భారత రచనా సందర్భంలో తన ధార ఆగితే తిక్కనగారు తన నాలుకను చేదించుకుంటానని వ్రాత ఆగితే గురునాథుడు తన చేతిని ఖండించుకుంటానని ప్రతిన చేసికున్నారట. అలాగే గణపతి వ్యాసునితో తన ఘంటం ఆగకుండా కవిత చెప్పవలెనని లేకుంటె తాను వెళ్లిపోతానని చెప్పగా వ్యాసమహర్షి సరే నేను చెప్పేది నీవు కొంచెం అర్థం చేసుకొని వ్రాస్తూవుండు అని గణపతితో అని

నియమంచేసి తానుముందు కథను ఊహించుకోవలసి వచ్చినపుడు ఏవో కొన్ని ముడిపదాలతో ఒక శ్లోకం చెప్పేవాడట.

గణపతి దాన్ని అర్థంచేసకొని వ్రాసే లోపల వ్యాసుడు ముందు కథను ఊహించుకునేవాడట మూలభారత రచన ఈ నియమాలలో సాగింది కాబట్టే యిపుడు మనకు సంస్కృత భారతంలో అక్కడక్కడ అర్థంగాని ఘట్టాలు కొన్ని తారసపడుతుంటాయి. వానికిపుడు వ్యాసఘట్టాలని వ్యవహారం.

పరీక్షిత్తు శుకమహర్షితో భాగవతం వినటంగూడ ఇట్లాగే జరిగింది. శుకమహర్షి నీ ప్రశ్న ఎపుడు ముగిస్తే అపుడు అంటె నీవిక ఏదీ అడుగలేనపుడు నేను వెళ్లిపోతానన్నాడు. అది విని ఆయన అలాగే అని ఆ మహర్షి సమాధానం పూర్తి అయ్యేలోపల మరో క్రొత్త ప్రశ్న ఆలోచించి పెట్టుకుంటూ ఆ విధంగా ఆయనను అవసానం వరకు తన సన్నిధిలోనే నిలుపుకోగలిగినాడు.

ఆనాటి విద్యావంతుల ప్రతినలు జిగీషలు ఇట్లా ఉండేవి.

ఉ॥ ఏ పనికైన నిన్నె మునుపెన్నుట యున్నది లోకపాడిగా
కాపును ప్రాపు ప్రోపువయి కార్యములెల్ల నవిఘ్న వృత్తిగా
నీపని సేయుటన్న యది నేమమొకండును బెట్టి కొంట నీ
కేపగి దింబరోపకృతికేగద నీకు నతుల్ గణాధిపా

**"రాఘవాన్వయము"** **రామరాజు వెంకట కృష్ణయ్య**

స్వామీ ! ఎవరేపని తలపెట్టినా మొదట నీకు నమస్కరించటం ఒక ఆచారంగా ఉంది. నీవు లోకానికంతా కాపు. ప్రాపు: ప్రోపులై సమస్తమైన కార్యాలు నిర్విఘ్నంగా చేయించటం అన్నది వృత్తిగా పెట్టుకున్నావు. నీయొక్క ఈ వృత్తి లోకోపకారార్థమేగదా! అటువంటి నీకు నమస్కారాలు.

మ॥ నిను పూజింపక యెట్లు వచ్చునికమున్ విస్తుల్యమౌ హెచ్చు చం
దనమందార మరంద ధారలకు చంధాలిచ్చునందాల క
వ్యనవీన ధ్వనులీను శబ్ద రచనాన వ్యాఖ్యవీనుల్ గ్రహిం
చిన పల్యంకిక పట్టుకుచ్చు కరుణా సింధూ శివానందనా

**"వందేమాతరం"** **ముదిగొండ వీరభద్రమూర్తి**

ఓ శివుని కుమారా నీవు క్రొత్త క్రొత్త ధ్వనులు సృష్టిస్తు నూతనమార్గంలో నడిచే కవులు మోసే వాగ్దేవి పల్లకియొక్క పట్టుకుచ్చువు. కనుక నిన్ను పూజించకుండానే వారి కవిత్వానికి చందనం, మందారం యొక్క మకరంద ధారలకు గూడా అందాలీయగలిగిన సాటిలేని గొప్పదనమెట్లా బగుతుంది. అనగా కలుగదు. అది తప్పకుండా నిన్ను పూజిస్తేనే కలుగుతుంది. అని భావం.

శా॥ శ్రీ దుడుండయ్యును విఘ్నకారుడనగా చెన్నొందెనే రీతి గౌ
రీ దత్త ప్రతిభా విశేషు డగుచున్ లీలాగతిన్ వజ్ర తుం
డో దంతం బెటులన్వయించెనొ! యిదెంతో చిత్రమన్ భక్తులన్
మోదం బొప్పగ గాచు నాగజముఖున్ పూజింతు సాయిరూపునిన్

**"సాయిలీలాగుచ్ఛము"** **యర్. మార్గసహాయాచారి**

షిర్డీ బాబాగారు శ్రీ బి.వి.దేవు సోదరునికి చిదంబరరావు గాడ్గిల్‌గారికి, వినాయక రూపంలో దర్శన మిచ్చినాడు. కనుక ఇందులో గణపతి విరోధాభాసాలంకారంలో షిర్డీబాబా రూపంగా వర్ణింపబడినాడు. ఎట్లాగో ఆ విశేషం వినండి.

వినాయకునికి శ్రీదుడు అనగా శుభాలిచ్చేవాడని విఘ్నకారుడు అనగా ఆటంకాలు కలిగించే వాడని వ్యవహారాలున్నవి. ఈ రెండు పేర్లు పరస్పర వ్యతిరేకం. ఈలాగే వినాయకుడు గౌరీదేవి చేత వరాలు పొందినవాడు. వజ్రతుండుడు అనగా గట్టి తొండంగలవాడు. అనేపేరున్నప్పటికి వజ్రతుండ నామం దోమక్కూడా ఉంది. కాబట్టి గణపతి గౌరీవరప్రసాదుడుగదా హీనార్థమైన ఈ వజ్రతుండ నామం ఇతని కెట్లా సరిపోతుంది అని చూపరులాశ్చర్యపడుతూ ఉండగా భక్తులను రక్షించే సాయీరూపుడైన గణపతిని పూజిస్తున్నాను.

షిర్డీ బాబాగారు ఒక్క గణపతి రూపంలోనేగాక
ఛందోరత్ బంధువు బాలాసాహెబ్‌గారికి దత్తాత్రేయుడుగా
రఘువీర్ పురందరేకు రుక్మాబాయి సమేత విఠలునిగా
గాలీబువా అనే వృద్ధునికి పండరీనాథునిరూపంగా
నిమోన్కర్ కుమారుడు సోమనాథునికి మారుతి రూపంగా -
ఇట్లా భక్తులకు వారివారి యిష్ట దైవాలరూపంలో అనేక పర్యాయములు దర్శనమిచ్చినాడు.

మ॥ తనుసేవించు జనాళి విఘ్నములు సంతాపమ్ములం బొందగా
దనకెవ్వాడు విభుండు లేక జగతిన్ దానంతకున్ మూలమై
వినుతాన్వర్థముగా వినాయకుడు నావిఖ్యాతి పాటించు న
య్యనిమేషార్చిత పాదు దంతి వదనున్ బ్రార్థింతు నర్థాప్తికై

**"శ్రీ రాధికా పరిణయము"** **గోపీనాథం వెంకటకవి**

లోకంలో తనకంటె ఎవడూ గొప్పవాడు లేక తానే అంతటికి మూలమైన వాడై తనను సేవించేవారి ఆటంకాలన్ని ఆటంకం పొందుతూ ఉండగా వినుతించేవారికి నాయకుడు (వి+నాయకుడు)

అని విశిష్టమైన పేరు పొందినవాడు. దేవతలందరితో పూజింపబడే పాదపద్మాలుగలవాడు అయిన వినాయకుని నేను నా కోరికలు తీరేందుకు ఎల్లప్పుడు ప్రార్థిస్తాను.

వినాయక శబ్దానికి వినయతి శిక్షయతి దుష్టాన విఘ్నాంశ్చేతి వినాయకః దుష్టులను, విఘ్నాలను శిక్షించేవాడు.

విగతోనాయకః ప్రభుర్యస్య స్వతంత్ర త్వాత్ తనకెవ్వరును ప్రభువులు లేకుండ స్వతంత్రుడు అని వ్యుత్పత్తులుండగా ఈ కవిగారు దీనిలో వినుతించేవారికి నాయకుడని వినాయకునికి ఒక క్రొత్త అర్థాన్ని చెప్పినాడు.

చ॥ తనయుని బొజ్జజూచి కడుదచ్చున లాడెనితండటంచు చం
ద్రుని పయికిన్క గొన్నయును, తోరపు భక్తిని విఘ్ననాయకున్
ఘనతర పూజనాదిక మొనర్చిన వారల కాయురాది శో
భనములో సంగునంచు తొలిప్రార్థన జేసెద శ్రీగణేశ్వరున్

"జానకీరామము" వేదుల వేంకటశాస్త్రి

చంద్రునికి అతని ముఖం చూడరాదని పార్వతీదేవియే శాపంపెట్టినట్లు ఒక కథ కనుక నా కొడుకు బొజ్జను చూచి వీడు మిక్కిలి పరిహాసం చేసినాడని పార్వతి చంద్రునిపై కోపించగా ఆమె చంద్రునికిచ్చిన శాపిన్ని తనను పూజించిన వారికి తగులకుండా మరల్చి ఆయురారోగ్యాలు ఈయగలవాడని గణపతిని నేను మొదట ప్రార్థిస్తున్నాము.

శా॥ విఘ్నత్వంబున గాక పాపఫలమై నిత్యంబు వేధించు కా
ర్య ఘ్నత్వంబు నడంచి యాశ్రితుల విద్యాయోగ్యులు జేసి ని
ర్విఘ్నోత్తేజము నిచ్చి కావ్యముల నిర్మింపన్ కటాక్షించు శ్రీ
విఘ్నేశున్ వినుతింతు మత్కృతి సమాప్తిన్ గూర్చి రక్షింపగాన్

"శ్రీకృష్ణ భారతము" భూతపురి సుబ్రహ్మణ్యశర్మ

తలపెట్టిన పనులకు ఆటంకం కలిగినప్పుడిది ఫలానాదాని చేత కలిగిందని అనుకోవటం లోక సహజం కాని ఆ విధంగా ఇతరుల చేతగాక ఎల్లప్పుడూ గూఢ విఘ్నరూపంలో వెంటాడే పాపఫలాన్ని అణచివేసి ఆశ్రితులనెల్ల యోగ్యులనుజేసి వారికి నిర్విఘ్నమైన ఉత్తేజాన్ని కలిగించి పనులు చేసే శక్తిని కలిగించే విఘ్నేశ్వరుని నేను సేవిస్తున్నాను.

ఉ॥ ఈశుని చేర మూషికము నెక్కి యరుంగుచు నంతలోనె వా
తాశన మొకడ్డ మరుదెంచిన యూరక యుండియు నన్ను గొంల్వరన్

వాసికినై వినాయకుడు వచ్చితినయ్య యటంచు బల్కు వి
ఘ్నేశుని గొల్తు మత్కృతిక హీన చమత్కృతి వాక్ప్రసూతికిన్

**"వీలుగుంట వీరభద్ర చరిత్ర"** **క్రిష్టపాటి వేంకట సుబ్బకవి**

శివుని సేవించటానికి వినాయకుడు ఎలుక నెక్కి వెళ్ళుతూ దారిలో అక్కడ సర్పాలుంటవి గదా అని సంశయించి తండ్రితో నన్ను సేవించటానికి రాలేదు అనే అపవాదుకు వచ్చినాను గాని లేకుంటె వచ్చేపనిగాదు. అని పలికే వినాయకుని నేను నా కృతికి చక్కని వాక్చమత్కారాలు కలిగించాలని కోరి సేవిస్తున్నాను.

ఉ॥ రాఘవ పావనీయ మమరయ్య కథారచనా ప్రణాళికా
మోఘ వితర్క వారివిధి మున్కలు వెట్టెడు నాకు దక్ష్క్రియా
లాఘవముం బొనర్ప కయిలాగొసగన్ దరిజేర్ప దుష్ట ని
ఘ్నౌఘము ద్రుంప గొల్చెద గజాననుఁ భక్తముఖాబ్జభానువున్

**"రాఘవ పావనీయము"** **కావూరి పూర్ణచంద్రరావు**

గణపతి శ్రీరామునికి హనుమతంతునికి ఇద్దరికి కావలసినవాడే కాబట్టి రాఘవ పావనీయమనే ద్వ్యర్థి కావ్యరచన అనే సముద్రంలో మునుగుతూ తేలుతూ ఉన్న నాకు ఆ రచనా లాఘవం చూపి చేయూత యీయమని నాకు కలిగే ఆటంకాలన్ని తొలగించమని భక్తుల యొక్క ముఖకమలాలకు సూర్యుడైన గణపతిని సేవిస్తున్నాను.

చ॥ తరలక తల్లిమాట విని తన్గవ దాటితి నంచు తండ్రి యి
ర్వురకును నూడు బూన్పనరువున్ గనియామె వటూఱిసింగమై
పరగగ గౌరుమోమిడెను బాపురెవాకని మిత్తి గొంగకున్
కరము దలంకి మ్రొక్కు వెనకయ్య తలంచెద నిచ్చమెచ్చుచున్

**"సత్యవిజయము"** **అయ్యనకోట పార్థసారధి సెట్టి**

పార్వతి ఒకనాడు స్నానానికి వెళ్లుతూ నలుగుపిండితో బొమ్మనుచేసి ప్రాణంపోసి ద్వారందగ్గర కాపలా ఉంచి లోపలికి వెళ్లిందని అపుడు బయటినుండి శివుడు రాగా అతనిని ఆ బాలుడడ్డగించినాడని అపుడు శివుడు కోపించి శూలంతో వాని శిరస్సు ఛేదించి లోపలికి వెళ్లినాడని ఆ తరువాత పార్వతి లోపలికి వచ్చిన శివుని వల్ల తాను ప్రాణంపోసిన పిండి బొమ్మను అతడు తలనరికినట్లు తెలిసి కోపించగా అపుడు శివుడా బాలునికి ఏనుగు తలనతికించి బ్రతికించినట్లు గణపతి జన్మవృత్తాంతాలలో ఒక గాథ ఉంది. పాఠకులు ఆకథ నిక్కడ అనుసంధించుకోవలె.

శివుడు ఈ పోరడు తల్లిమాట విని నన్ను ధిక్కరించినాడు కనుక మళ్లీ ఈలాగే బ్రతికిస్తే వీడెప్పుడైనా నన్ను ధిక్కరించేవాడే కాబట్టి ఈ తల్లికొడుకులకు ఎప్పుడైనా వైరం ఏర్పడాలని తలచి ఆమె వాహనం సింహం కనుక దానికి వైరమైన ఏనుగుతలను నా కతికించి బ్రతికించినాడని తలచి శివునికెల్లపుడు భయపడుతూ మ్రొక్కుతూ ఉండే వినాయకుని నేనెల్లప్పుడు మనసుసలో మెచ్చుకుంటు తలుస్తుంటాను.

ఉ॥ ఎవ్వడు సర్వకార్యముల నెల్లజగంబుల నగ్రపూజ తుం
డెవ్వడఖండ విద్యలను నింపుగ భక్తుల కిచ్చు సద్గురుం
డెవ్వడమేయ విఘ్నముల నేపడగించి శుభంబు లిచ్చు వా
డెవ్వడ జేయుడట్టి విబుధేశు గణేశు నుతింతునెప్పుడున్

**"సతీబాలబ్రహ్మేశ్వర పరిణయము"        బొడ్డుచర్ల చెన్నకృష్ణకవి**

సమస్త కార్యాలతో అగ్రపూజలందుకొనేవాడు, అఖండమైన విద్యలను భక్తులవిచ్చేవాడు ఆటంకాలన్ని తొలగించి శుభాలిచ్చేవాడు ఎవడో అటువంటి గణపతిని నేనెల్లపుడు నుతింతును.

ఈ పద్యం పోతనగారి ఎవ్వరిచే జనించు జగమెవ్వనిలో పలనుండు తలమై అనే దాని నీడలో నడిచింది. దీనిలో గణతపతి గణేశుడు విభుధేశుడు అనగా దేవతలందరి కంటె దొప్పవాడుగా చెప్పబడినాడు.

చ॥ తొలుమలు వేల్పులం దెవడు తొల్తటి పూజన మందగల్గి వే
ల్పులకును మానవాళికిల పొచ్చెమొకింతయు లేక కోరికల్
కలుగన విఘ్నతన్ కరుణగాంచుచు ప్రీతి నుమాంకమందు ని
చ్చలు సుఖముండు శ్రీముఖుని సన్నుతి సేయుదు కావ్యసిద్ధికై

**"చిలుకూరు వేంకటేశ్వర మహాత్మ్యము"        అలంపురి బ్రహ్మానందం**

పూర్వదేవతలలోను దేవతలలోను మొదటివారై మొదటి పూజలు గ్రహిస్తూ అటు దేవతలకు ఇటు మానవాళికి ఏ భేదం లేకుండా కోరికలు తీరుస్తు వారిని దయతో చూస్తు గౌరీదేవియొక్క తొడపై సుఖంగా ఉన్నటువంటి - ఏనుగు మంగళప్రదమైనది కనుక శుభప్రదమైన ఏనుగుముఖం కలిగిన గణపతిని నేను కార్యసిద్ధికై నుతిస్తున్నాను.

మ॥ దురితక్ష్మాధరముల్ బగుల్ప పవియున్ దౌర్గత్యమత్తారి రా
ట్కరి వర్గంబుల నిల్ప సంకుశము విఘ్న ధ్వాంతముల్ ద్రోల భా
స్కర బింబంబు దరిద్ర కాననము... నేచన్ నీతి హోత్రుండనన్
కరమొప్పారెడు విఘ్నరాజు నెపుడున్ కాంక్షించి వర్ణించెదన్

### "శ్రీ మన్నెముకొండ హనుమద్దాసు చరిత్రము"  పోకూరి కాశీపతి

ఆటంకాలనే కొండలు పగులగొట్టడానికి వజ్రాయుధం భుజబలం చేత మదించిన శత్రువులనే ఏనుగులను నిలుపటానికి అంకుశం, ఆటంకాలనే చీకట్లను తొలగించటానికి సూర్యబింబం దరిద్రమనే అడవిని కాల్చటానికి అగ్నిహోత్రం అయి ఒప్పుతూ ఉన్న వినాయకుని ఎల్లపుడు కోరికతో నుతింతును.

ఈ పద్యంలో పూర్వార్థంలోని రెండు చరణాలలో వినాయకుని ఆయుధాలు వజ్రం, అంకుశం అనేవి చెప్పబడినవి. ఉత్తరార్థంలో రెండు విశేషణాల చేత వినాయకుడు ఎఱ్ఱనివాడు కాబట్టి చీకటిని తొలగించే (బాల) భానుడుగా దరిద్రమనే అడవులను కాల్చే అగ్నిహోత్రుడుగా రూపింపబడినాడు.

ఉ॥ వేలుపు పిండుగా వనరి వీరభయంకర రూపధారివై
కూలిచినాడు వాగజముఖుండను దైత్యుని నాటినుండి గుం
జీలను దీయుచుందురుట జేజెలు నీకడ నిల్చి భక్తి భా
వాలు సుమింపగా! భువనవంద్యుడ వీవు వినాయక ప్రభూ!

### "రసభారతి"  రసరాజు

ఓ వినాయక ప్రభువా ! నీవు దేవతలను రక్షించే అందుకై భయంకరమైన రూపాన్ని ధరించి గజముఖుడనే రాక్షసుని సంహరించినావు. నాటినుండి దేవతలు నీ యెదుట భక్తితో గుంజీలు తీస్తున్నారు. అట్టి నీకు నమస్కారం.

ఈ పద్యంలో యింతవరకెవ్వరూ చెప్పని విషయం - వినాయకుని ముందు గుంజీలెందుకు తీయవలెనో చెప్పబడింది.

పూర్వం గజముఖుడనే దానవుడున్నాడు. వాడు దేవతలవేడిపించడానికి ఓ క్రొత్త పద్ధతి కనిపెట్టినాడు. ఇంద్రుడైనా అతనికంట పడినాడంటే తనముందు గుంజీలు తీయవలసిందే. లేకుంటే వదిలేవాడు కాదు. అప్పుడందరూ వెళ్లి బ్రహ్మదేవునితో ఆ విషయం మొరపెట్టుకోగా ఆయన వారితో మీరు వెళ్లి వినాయకుని ఆశ్రయించండి అని పంపినాడు. అప్పుడు వారు వచ్చి వినాయకునితో తమగోడు చెప్పుకోగా వానిపైకి వినాయకుడు దండయాత్రకు బయలుదేరినాడు. అపుడు గజముఖుడు వినాయకునితో యుద్ధంలో ఓడిపోయి మూషకరూపం ధరించి ఓ కలుగులో దూరినాడు. అంత వినాయకుడేమి చేయలేక తనయొక్క ఒక దంతాన్ని పెరికి వానిపై ప్రయోగించగా అది వెళ్లి ఆ కలుగునంతా త్రవ్వి గజముఖుని పట్టుకొని వచ్చింది. అపుడు వాడు వినాయకునికి దాసోహమని అతనితో స్వామీ నేను మీరేది చెప్పినా వింటానుగాని ఆ దేవతలు మాత్రం మా జాతికి చేసిన అన్యాయానికి నాముందు గుంజీలు తీయవలసిందే అని కోరినాడు.

అపుడు వినాయకుడది విని బాగా ఆలోచించి అయితే నీవీరూపంలోనే నాకు వాహనంగా ఉండు. నేను నీపై యెక్కి వెళ్లి దేవతలతో మీరంతా నాకు నమస్కరించే అపుడు గుంజీలు తీసి నమస్కరించవలెననే కట్టడి చేస్తాను. ఆ గుంజీలు నీకు నమస్కారం నాకు. అని ఓ పరిష్కారమార్గం చెప్పినాడు. దానికి గజముఖుడంగీకరించి నాటి నుండి వినాయకునికి మూషకరూపంలో వాహనంగా ఉండటానికంగీకరించినాడు.

పిమ్మట అతడిక ఆ మూషకాన్నెక్కి దేవలోకానికి వస్తుండగా -

వినాయకుడు గజముఖుని జయించి వస్తున్నాడనే వార్త ప్రాకిపోయి అందరతన్ని చూడటానికి ఎదురుగా బయలుదేరినారు. అపుడందరికంటె మొదలు కుమారస్వామి అన్నగారికెదురుగా వెళ్లినాడు అపుడతడు తమ్ముని పిలుచుకుని తాను గజముఖునితో చేసికున్న ఒప్పందం రహస్యంగా చెప్పి వెళ్లి దేవతలందరు నన్ను దర్శించే అపుడు భక్తితో తమ శక్తికొలది గుంజీలు తీసి నమస్కరించవలెనని చెప్పు అని పంపినాడు.

అంత కుమారస్వామి దేవతల కెదురుగా వచ్చి మా అన్నగారు గజముఖుని జయించి అతనినే వాహనంగా చేసికుని వస్తున్నాడు కాని ఆయనలో యింకా ఆ కోపం ఆ ఉత్సాహం రెండు చల్లారలేదు. కనుక మీరందరూ ఒక్కొక్కరే ఆయన ఎదురుగా వెళ్లి భక్తితో గుంజీలు తీసి నమస్కరించండి ఆయన సంతోషిస్తాడు. అని చెప్పినాడు. అపుడామాటను దేవతలంతా సంతోషంతో అంగీకరించినారు. కాని ఎటైతేనేం వారికి మాత్రం గుంజీలు తప్పలేదు. కాకుంటె అపుడవి భయంతో తీసేవారు. ఇపుడు భక్తితో తీస్తున్నారు.

అతడీ దండయాత్రకు వెళ్లే సందర్భంలోనే చంద్రుడతని ఆకారంచూసి పొట్టివాడు ఈ దానవునేం గెలువగలడని నవ్వివాడని అపుడు వినాయకుడు గజముఖుని గెలిచివచ్చి చంద్రుని తాను గెలిచిన దినంనాడు అతనిని దర్శించినవారు నీలాపనిందల పాలౌతారని శాపం పెట్టినట్లుగ గూడ ఈ కథలోనే ఉంది.

చ॥ అవయ మశేషవిఘ్నవ జనావళిచే విధి వత్ప్రకార మ
ర్చనల కడిందినరది మదినంతన మంది మనోరథంబు లా
జనులకు గూర్చి బ్రోచు కడుచల్లని వేల్పుగ జాన్యునివ్ మనం
బున దలతువ్ జగత్ప్రథమ పూజ్యు గణేశుని మాతమాళవువ్

"శ్రీ శిరీషనగ గండికా మహాత్మ్యము" ఇమ్మడిశెట్టి చంద్రయ్య

ఎల్లపుడు గూడ అనేకమైన ప్రజలచేత శాస్త్రప్రకారంగా పూజింపబడుతూ సంతోషించి వారివారి కోరికలు తీర్చేవాడు, చల్లనివాడు, గజముఖంకలవాడు, లోకంలో అందరు దేవతలకంటె మొదట పూజింపబడేవాడు, పార్వతీదేవి కుమారుడైనవాడు అయిన గణపతిని నేను నా మనస్సులో నిత్యము స్మరిస్తున్నాను.

# ఇందలి కవులు - కావ్యాలు

1. అనంతామాత్యుడు - బోజరాజీయం
2. అయ్యనకోట పార్థసారధి - సత్యవిజయం
3. అయ్యలుడు - రెట్ట మతశాస్త్రం
4. భాస్కరుడు - రెట్ట మతశాస్త్రం
5. అయ్యలరాజు నాయణామాత్యుడు - హంసవింశతి
6. అల్లసాని పెద్దన - స్వారోచిషమను సంభవం
7. అవధానం చంద్రవకాళిశర్మ - సేతుబంధనం
8. ఆత్కూరి మొల్ల - మొల్ల రామాయణం
9. ఆదిపూడి ప్రభాకరామాత్యుడు - ఆంధ్రపరాశర స్మృతి
10. ఇమ్మడి జెట్టి చంద్రయ్య - శ్రీ సిరిషనగ గండికామాహాత్యం
11. ఎడపాటి ఎఱ్ఱన - మల్హణచరిత్ర
12. ఎఱ్ఱన - హరి వంశం
13. ఏనుగు లక్ష్మనకవి - సుభాషిత త్రిశతి
14. కంకంటి పాపరాజు - ఉత్తర రామాయణం
15. కంచిరాజు సూరయ్య - కన్నప్ప చరిత్ర
16. కనుపర్తి అబ్బయామాత్యుడు - అనిరుద్ధ చరిత్ర
17. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి - విక్రమాంక దేవచరిత్ర
18. కాశీ విశ్వనాథరావు - విక్రమాంక దేవచరిత్ర
19. కలుగొట్ల విజయాత్రేయ - కర్ణుడు
20. కల్యూలరి అహోబలరావు - కృష్ణకర్ణామృతం
21. కాకునూరి అప్పకవి - అప్పకవీయం
22. కాకుమాని గంగాధరుడు - బాలభారతం
23. కాణాదం పెద్దన - అధ్యాత్మరామాయణం, కుకుంద విలాసం
24. కావూరి పూర్ణచంద్రరావు - రాఘవ పావనీయం
25. క్రిష్ట పాటి వెంకట సుబ్బకవి - దీబగుంట వీరభద్రచరిత్ర
26. కూచిమంచి తిమ్మకవి - రాజశేఖరవిలాసం
27. కూచిమంచి వెంకటరాయడు - సుకవిజనమనోరంజనం
28. కృష్ణమాచార్యుడు - దనుర్విద్యావిలాసం
29. కొట్టరువు తిక్కన - విజయసేనం
30. కొరివి గోపరాజు - సింహాసనద్వాత్రింశిక

31. కోటవీరాంజనేయ శర్మ - మాధురీ సుధాకరం
32. కోటి రఘునాథరాయడు - పార్వతీపరిణయం
33. కోటి వెంకనార్యుడు - ఆంధ్రభాషార్ణవం
34. గణపవరపు వెంకటకవి - ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసం
35. గుమ్మరాజు రాయకవి - శ్రీ చౌడేశ్వరీ మహాత్మ్యం
36. గోపీనాథం వెంకటకవి - రాధికా పరిణయం
37. చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ - శాతావాహన చరిత్ర
38. చెన్నమరాజు చెన్నమరాజు - చారుచంద్రోదయం
39. చెఱుకుపల్లి జమదగ్నిశర్మ - శ్రీ రామరాజ్యం
40. చెళ్ళపిళ్ల బంగారేశ్వరశర్మ - శ్రీనివాస కల్యాణం
41. చెళ్ళపిళ్ళ నరసకవి - యామినీ పూర్ణ తిలకావిలాసం
42. చోడవరపు సత్యవతీదేవి - తొలకరి జల్లు
43. జంధ్యాల సుబ్రహ్మణ్య శర్మ - సాలంకార కృష్ణదేవరాయలు
44. జక్కన - విక్రమార్క చరిత్ర
45. జనమంచి శేషాద్రి శర్మ - బ్రహ్మాండ పురాణం
46. జోస్యం పద్మనాభయ్య - ఆంధ్ర ఫలగ్రంథం
47. తామరపల్లి తిమ్మయ్య - శేష ధర్మం
48. తురగారామకవి
49. అయ్యంకి బాలసరస్వతి - నాగరఖండం
50. తూము రామచంద్రారెడ్డి - అలవేలుమంగా పరిణయం
51. తెనాలి అన్నయ - సుదక్షిణా పరిణయం
52. తెనాలి రామకృష్ణకవి - ఘటికాచల మహాత్మ్యం
53. దంతులూరి బాపయ - మూర్తి త్రయోపాఖ్యానం
54. దగ్గుపల్లి దుగ్గన - నాసికేతూపాఖ్యానం
55. దామరాజు వెంకట శేషయ్య - రాఘవాన్వయం
56. దామెర్ల అంకభూపాలుడు - ఉషా పరిణయం
57. దూబగుంట నారాయణకవి - పంచతంత్రం
58. దోమ వెంకటస్వామి గుప్త - బాలబ్రహ్మేశ్వర పురాణం
59. ధూర్జటి - కాళహస్తి మహాత్మ్యం
60. నందూరి బాపయ్య - గణేశ్వర చరిత్ర
61. నంది మల్లయ్య - వరాహ పురాణం

62. ఘంట సింగయ్య - వరాహ పురాణం
63. నడితోకమార్గ సహాయచారి - సాయిలీలాగుచ్ఛం
64. నన్నెచోడుడు - కుమారసంభవం
65. పట్టమెట్ట సోమనాథకవి - సూతసంహిత
66. పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు - హర్షప్రబంధం
67. పాలవేకరి కదిరీపతి - శుకసప్తతి
68. పిండిప్రోలు లక్ష్మణకవి - రావణదమ్మీయం
69. పిల్లలమర్రి పినవీరన - శృంగార శాకుంతలం
70. పుష్పగిరి తిమ్మన - సమీరకుమార విజయం
71. పూతలపట్టు శ్రీరాములురెడ్డి - కంబరామాయణం
72. పెదపాటి సోమయ - అరుణాచల పురాణం
73. పోకూరి కాశీపతి - సారంగధరీయం
74. ప్రౌఢకవి మల్లన - రుక్మాంగదర చరిత్ర
75. బమ్మెర పోతన - శ్రీమదాంధ్ర భాగవతం, వీరభద్ర విజయం
76. బొడ్డుచర్ల చెన్నకృష్ణకవి - సతీబాలబ్రహ్మేశ్వర విలాసం
77. భట్టుమూర్తి - నరసభూపాలీయం, వసుచరిత్ర
78. భావన పెమ్మన - అనిరుద్ధ చరిత్ర
79. భూతపురి సుబ్రహ్మణ్యశర్మ - శ్రీమదాంధ్రాభ్యుదయం
80. మడికి సింగన - పద్మపురాణం
81. మద్దిపట్ల అప్పన్నశాస్త్రి - యోగసక్తా పరిణయం
82. కొట్ర వెంకటరామకవి - యోగసక్తా పరిణయం
83. మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి - సత్యనారాయణ మహాత్మ్యము
84. మన్నవహరి సర్వోత్తమరావు - ఆదర్శమైత్రి
85. మాదయగారి మల్లన - రాజశేఖర చరిత్ర
86. మారనకవి - మార్కండేయ పురాణం
87. ముక్కు తిమ్మన - పారిజాతాపహరణం
88. ముదిగొండ వీరభద్రమూర్తి - వందేమాతరం
89. మూలటికకేతన - దశకుమారచరిత్ర
90. రఘునాథరాయలు - వాల్మీకి చరిత్ర
91. రసరాజు - రసభారతి
92. లోకాలక్ష్మీ నరసింహాశాస్త్రి - సంగమేశ్వర మహాత్మ్యం

93. వెంకటశేషయకవి - సంగమేశ్వర మహాత్మ్యం
94. వడ్లూరి అచ్యుతరాయకవి - శివకామేశ్వరీ కల్యాణం
95. వట్టిపల్లి మల్లినాథశర్మ - మధురస్మృతి
96. వనపర్తి చెన్నకృష్ణయ్య - యాదవ భారతీయం
97. విస్సాప్రగడ కామరాజు - బేరీజు పద్యములు
98. వీపూరి వెంకటాచార్యులు - విశ్వకర్మ పురాణం
99. వెన్నెలకంటి సూరన - విష్ణుపురాణం
100. వెలగపూడి కృష్ణయ్య - భానుమద్విజయం
101. వేదుల మీనాక్షిదేవి - ఫల్గుణీ మహత్మ్యం
102. వేదుల వెంకటశాస్త్రి - జానకీరామం
103. వేముల రామాభట్టు - గౌరీవిలాసం
104. శ్రీనాథ మహాకవి - శృంగారనైషధం, కాశీఖండం, శివరాత్రి మహత్మ్యం
105. సంకుసాల నృసింహకవి - కవికర్ణ రసాయనం
106. సవరం చిననారాయణకవి - కువలయాశ్వచరిత్రం
107. సురభిమాధవరాయలు - చంద్రికాపరిణయం
108. సూరనకవి - ధనాభిరామం

నేనీ సంకలనంలో ఏయే కావ్యాలనుండి పద్యాలు గ్రహించినానో వారందరికి సవినయ అంజలి ఘటిస్తున్నాను.

శ్లో॥ జయంతితేసు కృతినోరస సిద్ధాఃకవీశ్వరాః
నాస్తితేషాంయశఃకాయే జరామరణజంభయం-